Regd No. N 45 / M. 3813

వెల ఒక అణా

102870

ఇటలీలో గృహ కల్లోలములు

# గోలకొండపత్రిక

బ్రిటను యుద్ధాశయమును గూర్చి హాలిఫాక్సు ప్రభువు

ప్రతి సోమ, గురు వారములందు వెలువడు జాతీయ పత్రిక

సంపుటము ౧౫ హైద్రాబాదు-దక్కన్ శా. శ. ౧౮౬౨ విక్రమసం॥ మాఘ శు॥ ౭ (౩-౫-౧౩౫౦ ఫ.) సోమవారము సంచిక ౭౫

# ఆఫ్రికాలో బ్రిటిషువారి మరిరెండు ముఖ్య విజయములు

## డెర్నా, సోమాలిలాండులను బ్రిటిషుసేనలాక్రమించుట

### ఉత్తర ఇటలీప్రజల తిరుగుబాటులు

**ఆఫ్రికాలో ఇటలీబ్రిటనులయుద్ధము**

బ్రిటిషుసేనలు బిసియాకుతూర్పుగా ౧౫ మైళ్ళ దూరానికివచ్చినవి. అచ్చటినుండి ఇటాలీయులు లేచిపోయిరి. బ్రిటిషుసేనలు ప్రస్తుతంఎరిట్రియా లో ౧౦౦ మైళ్ళదూరంపోయినవి. బ్రిటిషుగస్తీ సైనికదళాలుఇటాలీయసోమలీలాండులో ప్రవేశించినట్లువార్త వచ్చినది.

డెర్నాకూడ బ్రిటిషుసేనలచే ఆక్రమించబడినది,

ఇరిట్రియాకుచెందిన అగోర్డాటు బారెంటూ ప్రాంతంలో యుద్ధచర్యలు బ్రిటిషువారికి అనుకూలంగాసాగుచున్నవి. ఉమ్‌హాగార్ నుంచిపారిపోతున్న ఇటాలీయసేనలను వేటాడడంకొనసాగుతునేఉన్నది. అనేకప్రాంతాలలో తీవ్రగస్తీచర్యలుజరుగుతున్నవి. కాని అబిసీనియాలో పెంటి మా ని కి తూర్పుగాపరిస్థితిలో మార్పేమీలేదు. డెర్నాకు దక్షిణంగావున్న ప్రధానరస్తాలజంక్షనుస్థానమైనమెకెల్లీని బ్రిటిషుసైనికదళాలుచుట్టుముట్టినవి.

సూడానుసరిహద్దునుంచి వంద మైళ్ళు ఇరిట్రియాలోకి దాడిపోయినతర్వాత ఇటాలీయులు అగోర్డాటుగద్ద శత్రువునుప్రతిఘటించుటకు నిర్ణయించుకున్నారు. అగోర్డాటుఎర్రసముద్రంకేసిపోవు రైలుమార్గంలోవున్న ప్రధమపట్టణం.

జనవరి ౨౧ వ తేదిన ౨ గస్తీదళాలుసాయుధ మోటార్లలో వెళ్ళి మొయేలిప్రాంతంలోని ఇటాలీయదళాలను నాశనంచేసినవి మరికొందరు ఇటాలీయసైనికులు తర్వాతవచ్చి జరిపిన బదులుదాడులు జయముతో ప్రతిఘటించబడినవి ౨౦ శేకడం మంది ఇటాలీయసైనికులుచనిపోయివుందురు.

ఇట్లు ఇటాలీయుల ఆఫ్రికాసామ్రాజ్యంలోని లిబియా,అబిసీనియా. సోమాలీలాండులలో బ్రిటిషుసేనలు మంచివిజృంభణతో యుద్ధంచేయుచున్నది. ఎరిట్రియాలో అగోర్డాడు, బారెంటూలవద్ద రక్షితస్థానాలమీదకు బ్రిటిషుసేనలు చుట్టుముట్టివచ్చుచున్నవి.

ఇటాలీయులు అబిసీనియాను పూర్తిగా ఖాళీచేయుటకు సన్నాహాలుజరుపుచున్నారు.వారు జనవరినెలాఖరున పంటలునూర్పులు ముగిసిన తర్వాత అబిస్సీనియాదేశమంతటను ప్రజలుతమపై తిరగబడవచ్చునని భయపడియున్నారు.

లిబియా యుద్ధరంగంలో డెర్నాప్రాంతములో యుద్ధచర్యలు బ్రిటిషువారికి అనుకూలంగా సాగుతున్నవి టోబ్రుకువద్ద పట్టుబడినఖైదీలసంఖ్య ౨౫ వేలకుపైగాఉంటుంది.

ఎరిట్రియాలో జనవరి ౨౭ వ తేదినాటికి ౧౧౦౦ మంది ఇటాలీయఖైదీలు పట్టుపడిరి. అబిసీనియాదేశంలోపల దేశభక్తులకు మరికొన్నివిజయాలుచేపడినవి. మెకెమ్మామీద బ్రిటనుఒత్తిడిసాగుతున్నది. ఇటాలీయ సోమాలిలాండులో అన్నిప్రాంతాలలో బ్రిటిషుగస్తీసేనలకు విజయముచేకూరుచున్నది.

ఇదిఇట్లుండ డీగాలుగారి ఫ్రెంచిసైనికదళాలు ఇటీవల ఇటాలీయ లిబియాలోకిపోయి దాడిజరిపినవి. జనవరినెలలో చాడుకోవున్న అసైనికదళాలు జనరల్ డీలార్మినెటుగారి సైన్యాధిపత్యంక్రింద ఇటాలీయులిబియాకు చెందినఫెజానుప్రాంతంలో తీవ్రమైనదాడిజరిపి, మార్జుకుఅక్రయాన్ని ధ్వసంచేసినవి. గాట్రంవద్ద సైనికబలమునుకూడ చాలనష్టపరచినవి.

ఇకవిమానాలదాడులు జనవరి ౨౬ వ తేది గస్తీసంచారంసాగించిన బ్రిటిషుఫైటర్లు ౫ ఇటాలీయవిమానాలనుపడగొట్టినవి డెర్నాకు దక్షిణమున ఇటాలీయవిమానాలు పడగొట్టబడినవి. డెర్నాసమీపములోని బ్రిటిషుసేనలమీదకు వచ్చినరెండుఇటాలీయవిమానాలు బ్రిటిషు విమానాలచే కూల్చబడినవి. మెచీలీ సమీపంలో విమానాలుదిగేచోట నేలమీదఒకఇటాలీయవిమానం నాశనంచేయబడినది,లిబియాలో బార్స్‌వద్దవిమానాశ్రియంమీద బ్రిటిషువిమానాలు ౨౬ వ తేదిన విమానశాలలపై బాంబులువేసి విమానాలనుచెదరగొట్టినవి. ఒక్క బ్రిటిషువిమానంమాత్రం మరలిరాలేదు ఇటాలీయ తూర్పుఆఫ్రికాలో ఇరిట్రియాలోకి వెళ్ళుచున్నబ్రిటిషుసేనలకు బ్రిటిషువిమానాలు మంచితోడ్పాటుఇచ్చినవి. కెల్లీనావద్ద ఒకబ్రిడ్జిసమీపంలో బాంబులువేయబడినవి. బారెంటూవద్ద మోటారుదళాలపైరోడిషియన్ విమానాలు మరఫిరంగులుకాల్చినవి. ఉమ్‌హాగారువద్ద ఒకమోటారు సరఫరానౌకమీద మరికొన్ని రోడిషియన్‌విమానాలు బాంబులువేసినవి. కెల్లీనా చారెంటూప్రాంతంలో విమానాలు దిగేచోటగూడా బాంబులువేయబడినవి.

తూర్పులిబియాలో బ్రిటిషువిమానాలకును, ఇటాలీయవిమానాలకును తీవ్రమైనయుద్ధములు జరిగినవి. కొన్నిదినాలుగా బ్రిటిషువిమానాలు గస్తీసంచారాలు జరుపుతున్నప్పుడు ఇటాలీయవిమానాలు ఎదురుపడలేదు. ఇప్పుడు మొదటిసారి ఎదుర్కొని జరిపినయుద్ధాలలో ఒకబ్రిటిషువిమానం ౫ ఇటాలీయవిమానాలు నష్టమైనవి.

**ఇటలీవారి గృహకల్లోలాలు**

మార్షల్ గ్రాజియానీ తొలగించబడినట్లు టర్కీలోని రేడియోలో జనవరి౨౭వతేది రాత్రిప్రకటించబడినది కాని అదినిజంకాదని ఇటలీలోని అధికారవర్గాలు తెలుపుతున్నట్లు జర్మన్ న్యూస్‌ఏజన్సీ ప్రకటించినది.

ఇటాలీయ విదేశాంగమంత్రియగు కౌంట్‌షియానోగారు యుద్ధరంగంలోని ఒక బాంబరు విమానదళమునకు అధిపత్యంవహించినాడని ఒక వార్తవచ్చినది

ముసోలినీఅల్లుడూ, ఇటలీవిదేశాంగమంత్రి అయిన కౌంట్‌షియానో 'యుద్ధంచేయాలి: లేసం చేచావాలి'అనే విమానదళంపైసేనాధిపత్యం వహించి యుద్ధరంగానికి వెళ్లినాడు. ఇటలీ నియంత ముద్దుకూతురు భర్త యగు ఇతడు విమానదళంలో చేరడానికి ఈవిధంగావెళ్ళడం ఇది రెండోసారి. మొదటిసారి కౌంట్‌షియానో ఇట్లు వెళ్లింది, అబిసీనియా యుద్ధ సందర్భంలో గత అక్టోబరునెలనుంచీ ప్రముఖ ఇటాలీయ ఉద్యోగులు ఎందరో ఎదురుకుండా అనారోగ్యకారణాలను చూపిస్తూ తమతమపదవులనుంచి తొలగుటకు సిద్ధలచుచేయవలసిందని చేసుకున్నారు. ఇటాలీయ సర్వసేనాని మార్షల్‌బడోగ్లియో ఇప్పుడు ప్రత్యేకంగా పహారాలో ఆయన ఇంట్లో నిర్బంధించబడినట్లుతెలుస్తున్నది. రోమునగరపరిసరాలలో బడోగ్లియో నివసించే ఇల్లువున్నది. పదభ్రష్టుడు కావడానికి మార్షల్ బడోగ్లియో మొదటివాడు. తర్వాత పదభ్రష్టుడైనవాడు జనరల్ సిసారిడీవెచీ. ఇతడు డోడెకనీసుదీవుల గవర్నరు. అతర్వాత పదభ్రష్టుడైనవాడు అడ్మిరల్ డొమెనికోకావాగ్నరీ, ఇతడు నౌకాదళాధిపతి. నౌకాశాఖా సహాయమంత్రికూడా. తర్వాత నౌకాదళఉపసేనాని ఓడ వార్జ్లో, సామిగ్లీ. వైస్‌అడ్మిరల్ బాబీ మొదలైనవారుకూడా పదభ్రష్టులైనారు. అల్బేనియాలో జనరల్ ప్రాస్కా స్థానంలో జనరల్ సాడ్డూ చేరాడు. ఐతే,ఇతడుకూడా ఎందుచేతనో ఇటలీకి తిరిగివచ్చివేశాడు. ముసోలినీఆగ్రహానికి గురికాని సైనికశాఖ ఒకవిమానశాఖమాత్రమే. దానిసర్వసేనాని జనరల్ ప్రికోలో, ఇటాలీయన్ విదేశాంగవిధానంపై ముసోలినీ అధ్యర్యం వహిస్తాడనుకున్నారు.

ఉత్తర ఇటలీలోవున్న పారిశ్రామిక మండలాలలో ప్రజలుతమప్రభుత్వముచేయుచున్న తప్పిదాలనుగురించి బహిరంగంగా ప్రసంగిస్తున్నారు రోమునగరవీధులలోనే యూనిఫారాలుధరించివున్న జర్మను సైనికులపైప్రజలఉద్రేకచర్యలుజరిగినవి. ఈకారణంచే వారంరోజులపాటు ఇటాలీయ పోలీసులు అరెస్టులజరిపారు. ఇటాలీయ రహస్యపోలీసులకు జర్మను రహస్యపోలీసు దళాలుకూడా సహాయపడినవి ఆకస్మాత్తుగా ఇటాలీయవిదేశాంగ కార్యాలయానికి చెందిన ఉద్యోగులు అంతర్ధానమైనారట వీరిలోచాలమంది గొప్పకుటుంబాలకు చెందినవారు. ఫాసిస్టు పాలనపట్ల ఆదరణలేనివారు విదేశీయరాజకీయవర్గాలవారు ఆశేపలు వీరలను ఆహ్వానించినట్లు కనపడుచున్నది. ఇటలీలోని యంత్రపాలనముతొలగించి రాజపాలనను అచరణలోకితేవలెనని గొప్ప ఇండ్లవారలు కోరుతున్నారు. సైనికదళాలపైన ప్రతికూలవర్గాలవారందరు తమపలుకుబడిని వినియోగించి పరిస్థితిని తారుమారుచేసెదరేమోనను ముసోలినీ భయమే, ఇటలీకి జర్మనుసైనికదళాలను త్వరిత్వరగా రప్పించుటకు కారణమని ఒక ఊహ.

ఇంకను జర్మనుసైనికదళాలను ఎక్కించుకుని రైలుబండ్లు బ్రెన్నర్ కనుమద్వారా ఇటలీలోనికి వచ్చిపడుచున్నట్లు వార్తలు వచ్చుచునేయున్నవి. జర్మను, ఇటాలీయసైనికోద్యోగులు రోము నగరంలో ప్రధాన సమాలోచనలు జరుపుచున్నారు

**ఇండియాకు ఇటాలీయ ఖైదీలు**

ఇటాలీయ ఖైదీలలో చాలామంది ఇండియాకు పంపబడుచున్నారని బ్రిటిషు పార్లమెంటు కామన్సుసభలో బ్రిటిషుయుద్ధమంత్రి కెప్టన్ మార్గస్సన్ గారు జనవరి ౨౧ వ తేదిన తెలియజేసెను.

మిగిలినవారివిషయం ఇంకానిర్ణయంకాలేదు. కొంతమందిని వ్యవసాయకూలీలుగా బ్రిటనుకు తీసుకరావలెనని ప్రభుత్వముఆలోచించుచున్నదట బ్రిటిషు కార్మికులు తక్కువగాఉన్న ఇతరపరిశ్రమలకుకూడా తీసుకరావలెనుకొన్నారు.

**ఇటలీగ్రీసులయుద్ధము**

గ్రీసులు మరికొన్నివిజయాలుపొందిరి, ఇటాలియనులను ఖైదీలుగాపట్టుకొని యుద్ధసామగ్రులుకూడా స్వాధీనపరచుకున్నారు ఇటాలీయవిమానదళాలు గందరగోళంలో తమస్వంతసైన్యదళాలమీదనే బాంబులు పడవేసినవి.

ఎల్బాసన్‌పై జయప్రదమైనదాడి జరిగినట్లు గ్రీసులోని బ్రిటిషుప్రధాన కార్యాలయప్రకటన తెలుపుతున్నది. బ్రిటిషుదళాలకుచెందిన విమానాలు అల్బేనియాలోవున్న ప్రధానఇటాలీయ ఆశ్రయస్థానమైన ఎల్బాసన్‌పై జయప్రదమైనదాడి జరిపినవి,

ఇటాలీయసేనాధిపతి జనరల్ కావల్లెరో జనవరి ౨౮, ౨౯ వ తేదులలో గ్రీసులపై పారింభించినదాడిని నిలిపివేసినట్లువార్తవచ్చినది అనేకప్లు సేనలకు సహాయకం లకోసం ఇటాలీయులు ఎదురు చూచుచున్నారు మంచుపడుచుండుటవల్ల ౨౮ వ తేదినాడు యుద్ధచర్యలకు ఉత్తరప్రాంతంలో అంతరాయము కలిగినది.

జనరల్ మెటాక్సాస్ కిఫిసియాలో స్వగృహంలో కొద్దికాలము వ్యాధిగ్రస్తుడై జనవరి ౨౯ వ తేదిఉదయం ౬ గం- ౨౦ ని-లకుచనిపోయినాడు.

గ్రీసుబ్యాంకుగవర్నరు. అలెగ్జాండర్ కోరిజిస్ క్రొత్తప్రధానిగావుండునని అధికారప్రకటనచేయబడినది.

తక్కినమంత్రులు యథాస్థానాలలో నేవుందురు. మంత్రివర్గము ౨౯ వ తేదిఉదయం ౧౦ గంటలకు రాజభక్తిప్రమాణంచేసెను

"మొట్టమొదటవిజయం" అనేఆదర్శవాక్యంతో క్రొత్తగ్రీసుప్రభుత్వం జనవరి ౨౯ వ తేది రాత్రి ఒకప్రకటనచేసినది.

జయంపొందేవరకు యుద్ధంసాగుతుందనియు రాజాజ్ఞకప్రకారం ప్రభుత్వంకీర్తిశేషుడయిన మెటాక్సస్‌ప్రధాని తమకువిడిచిపెట్టినకార్యభారాన్ని వహించుననియు ప్రకటనయుచున్నది

**థాయ్‌లాండ్, ఇండో చైనాలయుద్ధము**

ఇండోచైనాలో ఇంతవరకుఆక్రమించిన భూభాగాన్ని థాయ్‌లాండ్‌లో చేర్చుకొనబోతున్నట్లు థాయిలాండు ఉన్నతాధికారులు ప్రకటించినారు.

జపాను మధ్యవర్తిత్వానికి అంగీకరిస్తున్నట్లు థాయ్‌లాండు ప్రకటించిన రోజుననే పైప్రకటన జరిగినది.

ఈలోపున ఇండో చైనానుండి థాయ్‌సేనలను పూర్తిగా తొలగించినప్పుటనే పోరాటము ఆగుతుందని ఇండోచైనా సెక్రటరీజనరల్ ప్రకటించినాడు.

థాయ్‌సేనలు ఆక్రమిత భూభాగాన్ని వదలవలననే షరతుమీదనే శాంతిరాయబారాలు సాగవలెనని థాయ్ ప్రభుత్వం తెలుపుచున్నారు.

యుద్ధవిరామసంధి రాయబారాలలో పాల్గొనవలసిన ఫ్రెంచిఇండోచైనా, థాయిలాండు ప్రతినిధులలో ఆనేకులు జనవరి౨౯వతేదిన సైగాను వచ్చిరి.

జనవరి ౨౯ వ తేది ఉదయం౧౦గంటలకు యుద్ధవిరామం జరుగవలసిఉన్నను ఆరోజంతా థాయిలాండ్ ఇండోచైనాల మధ్యపోరాటముసాగినది.

జపానుకు ఈవిషయంతెలుపబడినది. థాయ్‌సేనలు యుద్ధరంగంపొడుగునా కాల్పులు అపివేసినప్పటికి కొంతసేపటివరకు ఫ్రెంచివారు కాల్పులుచేసిరని థాయిలాండువారనుచున్నారు.

థాయిలెండు, ఫ్రెంచి ఇండోచీనాల మధ్య యుద్ధవిరామసంభాషణలు సైగాన్ సమీపంలో ఒకజపానుయుద్ధఓడలో జరుగునని జనవరి ౨౯ వ తేది ప్రకటితమైనది. ఇండోచీనాలో వున్న జపాను మిలిటరీ రాయబారవర్గఅధ్యక్షుడు జపాను రాయబారవర్గానికి అధ్యక్షుడుగా పనిచేయునట.

**బ్రిటనుజర్మనీలయుద్ధము**

సెప్టెంబరుతరువాత ఇప్పుడుతొలిసారి జనవరి ౨౫ వ తేదితో అంతమగువారంఅంతా బ్రిటిషుపై జర్మనువిమానచర్యలు అగిపోవుటకు మూడుకారణాలు చెప్పుకొనుచున్నారు. మొదటిది యూరోపుఖండములో శీతలవాతావరణం, రెండవది జర్మనీరెండురంగాలలో విమానయుద్ధంచెయ్యడం, మూడవది, జర్మనీ తనసైనికపునర్నిర్మాణంచేసుకొనుటకు విశ్రాంతితీసికొనుచుండుట.

ఇప్పుడునప్పుడే [illegible], ఉత్తరఫ్రాన్సు న్నూ పాగ [illegible] కేంద్రస్థానాలలో బహుశా మంచు [illegible] తాత్కాలికంగా అటుగా [illegible]. క్రింటటి వారంలాంతా ఇంగ్లీషు ఛానెల్ అంతటను [illegible] వాతావరణం విమానచర్యలకు అనుకూలంగాలేకుండా జర్మనువిమానచర్యలు అగిపోవడానికి కారణాలలో ముఖ్యాతికవంతు ఈకారణమే అయివుంటుంది. ఈకారణంవల్లనే బ్రిటిషువిమానదళచర్యలకుకూడా చాలాఅటంకంకలిగిం,

వాతావరణం అనుకూలంగా లేకపోవడమే కాకుండా, జర్మనీరెండురంగాలలో విమానయుద్ధంకోసం తనసైన్యదళాలను పునర్విభజన చేసుకోవలసిన అవసరంవచ్చిందనడానికి సందేహంలేదు. సిసిలీవిమానాశ్రయాలకు క్రొత్తదళాలుచేరినవి. జర్మనువిమానదళాలు బ్రిటిషునౌకాదళాలపైనను, మధ్యధరాసముద్రంలో బ్రిటిషునౌకాకేంద్రాలపైనను దాడిజలపడంకోసమున్నూ అల్బేనియాలో యుద్ధంకోసమున్నూ సిద్ధంగావుంచబడుతున్నట్లు కనబడుతున్నది. ఉత్తరఫ్రాన్సులోను, పల్లపుప్రదేశాలలోను, మిగిలివున్న విమానదళాలను, మళ్లీక్రొత్తపరికరాలతో స్థిరపరచి. వాటితో బ్రిటనుపై తీవ్రదాడిసాగించడానికి ప్రయత్నంజరుగుతున్నదనడానికి సందేహంలేదు.

జనవరి ౨౩ వ తేదినాటినుండి ౨౫ తేదివరకు తొమ్మండుగురు జర్మనులు ఖైదీలుగా బ్రిటిషువారికిపట్టుపడిరి వారిలో పదహారుగురునావికులు ఇంగ్లీషుఛానల్‌లో బ్రిటిషుపడవలు శత్రువుతో పోరాడినవి.

జనవరి ౨౭ వ తేదిమధ్యాహ్నం ఇంగ్లాండు తూర్పుతీరానదాటుకొనివచ్చి ఒకజర్మనువిమానము బాంబువెల్లువల్ల కొందరుప్రజలుచనిపోయిరి. తరువాతఆవిమానం పడగొట్టబడినది ఉదయమువేళలో ఒకజర్మనువిమానం ఈశాన్యతీరంలో ఒకపట్టణంమీదబాంబులువేయగా కొద్దిమంది గాయపడిరి.

కొన్ని జర్మను విమానాలు దక్షిణతీరాన్నిదాటి జనవరి ౨౭ వ తేది సాయంత్రం ఆగ్నేయ ఇంగ్లాండుమీదకువచ్చినవి. కాని ఇవివేసినబాంబులవల్ల పెద్దనష్టంఏమీకలుగలేదు. ౨౭ వ తేది ఉదయం ఒకశత్రువిమానం తూర్పు కౌంటీలలో ఒకచోట చాలాబాంబులువేసినది గానితక్కువనష్టం కలిగినది.

లండనులో కొన్ని నివాసస్థానాలమీద ప్రేలుడుబాంబులువేయబడినవి. ఒక ప్రదేశంలో కొన్ని మంటలబాంబుపడినవి. ట్రాలీబస్సులుఆగిపోయినవి.

ఒక నివాసస్థానంలో పెద్దపెద్ద ప్రేలుడుబాంబులువేయబడినవి. ఇళ్ళకుకొంతనష్టంకలిగింది వీధులలో తిరుగుచున్న ఒక స్త్రీ చనిపోయినది.

జనవరి౨౯వ తేదినాటికి లండనుపైన రాత్రిపూట శత్రువిమానాలు యుద్ధాలు జరిపి పదిరోజులైనది, ఈపదిరోజులప్రశాంతత ఈరోజుతో అఖరైనది. ఈరాత్రిశత్రువిమానాలు విహరించినవి.

దేశంలో ఇతరప్రాంతాలలోకూడా శత్రువిమానసంచలనం మొత్తంమీద స్వల్పంగానే వున్నది.

జర్మనుల బారుఫిరంగులుకూడా కాల్పులుసాగించినవి. డోవర్‌ప్రాంతంపై అప్పుడప్పుడుగుండ్లుపడినవి. ఎక్కడా ఉపద్రవాలు సంభవించినట్లు ఇప్పటివరకు వార్తలులేవు.

బ్రిటనుకు వచ్చియున్న వెండెల్ విల్కీగారు ఈరాత్రిజరిగినదాడి ధ్వంసాన్ని చూసి కంట తడిపెట్టిరి.

వికూనదాడి రక్షణాశ్రయాలలో లండను ప్రజలు ఎలావుండగలరో అనుభవంమీద తెలుసుకోడానికి ఒకఆశ్రయంలో విల్కీప్రవేశించి చూసి, ఒక్కరుధైర్యముపడుతున్నట్లు కనబడలేదని గుర్తించెను.

బ్రిటిషు కార్మికమంత్రి ఎర్నెస్టు బెవిన్ గారు ట్రేడ్‌యూనియన్ కాంగ్రెసుతోను, ఎంప్లాయరు కాన్ఫెడరేషను తోను జరిపిన ఒకసభలో దేశప్రస్తుత [illegible] వలసినంత మందిమనుష్యులను

౨ వ పేజి చూడుము

## శివుడవతారమెత్తినాడు

### సనాతనుని అధిక ప్రసంగము

సనాతనమహాసభకు కార్యదర్శులగుట వంగపల్లి నీలకంఠముఅట ౨౦-౧-౧౯౪౦ వ తేది సోమవారమునాడు, ఉదయం యీసిద్దిపేటగ్రామము నకువిచ్చేసిరి. పురములోని సనాతనాయకులనంబడు. కొందఱు, సన్నాయి, డోలు, తప్పెటమొదలగు వాద్యములతో వారినెదుర్కొని యూరేగింపుతో పురప్రవేశమును గావింపజేసిరి. ములుగు కృష్ణయ్యగుప్తగారి మేడపై విడిదినేర్పాటు గావించి, విడియింపజేసిరి.

నీలకంఠముగారొక బహిరంగ సభను జరుపు కుతూహలముతో స్థానిక పోలీసు ముంతజముగారి నిదర్శించి తమయభిప్రాయమును వెల్లడింపగా "బహిరంగసభా సమావేశమునకు, తమయనుమతి చాలదనియు, నట్టిసభలకు అనుమతినిచ్చుటకు అవ్వలు సాహెబుగారికే యధికారముగలదని యు నిస్సందేహముగానుడివిరి అందుచే గత్యంతరములేక, నాటికేయివిశ్రాంతిగైకొనిరి. మరునాడు అనగా ౨౧-౧-౪౦ వ తేదీ మంగళవారము సాయంత్రము మూడుగంటలకు, అవశిష్టములన్నియు ముగించుకొని, సభగావించునిశ్చయముతో, స్థలనిర్ణయమైనను నరించుకొనకయే, వీధిలో ప్రవేశించి, తమమిత్రులతో నేమియో సంప్రదించుకొని, శ్రీయుత జయగోపాల్ సేటుగారిగృహమందలి వసారాయందు సభకై యేర్పాట్లుగావించిరి, కాని సభావిషయమై యెల్లరకు తెలియబరచని కారణమునను, తెలిపిన కొలదిమందికిని వ్యవధిలేకుండుటచేతను, సమావేశమైనవారిసంఖ్య తక్కువగ నే యుండెను.

శ్రీ పెట్టరామయ్యగారు, సభను ప్రారంభించి సదరు నీలకంఠముగారియౌన్నత్యమును, గొప్పతనమును, ఏకరువుపెట్టి సభికులకు వారిపరిచయమునుగావించిరి. పిదప శ్రీగుప్తగారి వెనువెంట వచ్చియుండిన బ్ర. శ్రీ. శాస్త్రిగారు లేచి, మహాగాంభీర్యముగ నిట్లుపన్యసించిరి.

ప్రస్తుతకాలమున సతధర్మములను మంటిలో గలుపు అధునికులుబయలుదేరినారు. కనుకమనమె మాత్రము, నేమరక, సనాతనధర్మాచరణమునకును, బద్ధకంకణులమైయుండవలెను. విగ్రహారాధనమే మనకుగర్తవ్యము. నేము. అధునికులచే శాసనసభ యందుప్రవేశపెట్టబడిన బాల్యవివాహ నిరోధక శాసన చట్టమును ప్రతిఘటించి, నానాకష్టముల ననుభవించి, సంస్థానమునందనేకసంస్థలనెలకొల్పి, కొల్లగా నెన్నవ్యయమొనర్చి సఫలమనోరథుల మైతిమి. కనుకమనకోరికలత్రోసివేయక కృతార్థతనొందించిన, శాసనసభవారికిని, మనమతవిషయములో సంబంధము నేర్పఱచుకొననందులకు మ. ఘ. వ. శ్రీ శ్రీ నిజాంప్రభువరేణ్యులవారికిని మనమందరము మనఃపూర్వకముగ కృతజ్ఞతాపూర్వకవందనము లర్పింపవలయుననిరి.

మరియు శ్రీశాస్త్రిగారు తమయుపన్యాసధోరణిలో గీతాప్రమాణమునుజూపుచు, ధర్మము నశించునపుడెల్ల భగవంతు డవతారమునుధరించి, ధర్మరక్షణమొనర్చుననియు శ్రీయుత నీలకంఠముగారు, సాక్షాత్కరించిన యపరశంకరులేయనియును, అవతారపురుషులనియును. ధర్మవిరుద్ధమైన శారదాశాసననిరోధమునకును, నాశనమునకును. సికిందరాబాదున నీలకంఠరూపమున నవతరించిన పుణ్యమూర్తియనియుగూడబల్కిరి. ఇంతియేగాక బ్రిటిష్‌రాజ్యమున యీ శారదాశాసనములులోనికి వచ్చియున్నందున, పూర్వాచారపరాయణులగువారికి ధర్మికవివాహములకాటంకము గల్గుచున్నదనియు, అట్లు విధియుక్త వివాహములసల్పు తలంపుగల బ్రిటిష్ పౌరులు, యీరాష్ట్రమునకు సకుటుంబముగా వచ్చువెడల, ద్రవ్యయుక్తముగనెల్ల యేర్పాటులు గావించి వారికి సహాయ మొనర్చుటకు తాము కంకణము ధరించియుండిరనియు, ఘంటాపథముగ నుడివిరి. రెండవశంకరావతారమని ఉపన్యాసకునిచేస్తోత్రముచేయబడిన శ్రీశ్రీనీలకంఠముగారి వాగమృతధారల తనివితీరగ్రోలి జన్మసాఫల్యత నొందగోరిన కొందరకు. ఆశాభంగము గల్గినదని యేచెప్పవచ్చును. అంతటి మహిమాన్వితులగు శ్రీయుతులు మౌనముద్రవహించిన కారణమేమొ?

ఇట్లుశాస్త్రిగారు ఏకధాటిగాసాగించిన యుపన్యాసమునుముగించుచు, సభికులనుద్దేశించి, ఎవరైనను, ఏవిషయమును గురించియైనను చర్చింప దలచినచో వారలకు సమయమొసంగబడునని నుడివి కూర్చుండిరి.

అంతట యీగ్రామవాసియొకడు శ్రీయుత డాక్టరుఎం. జి. కృష్ణారావుగారులేచి, శారదాశాసనమునుగురించియిట్లుపన్యసించిరి. ప్రజాప్రాతినిధ్యములేకయత్యల్పసంఖ్యగా హిందువులుగల, శాసనసభయందు, హిందూమతవిషయసమస్యను శ్రీ ఎంసర్బింగరావుగారు ప్రవేశపెట్టటకేవలముపొరపాటుఅదియుగాక, సంతకములనేకరింపవలయునని, అట్టిసంతకముల మెజారిటీపైననే శాసనజయాపజయములాధారపడియుండునను భావమును వెల్లడింపకపోవుట మరియొకచర్యయో తెలియరాదయ్యెననిరి మనరాష్ట్రములో కొలదికాలమునుండి తలచూపుచున్న మతద్వేషములవల్ల, హిందువులకభివృద్ధిదాయకమగు శారదాశాసనమునేగాక, మతీయేయితరశాసనములును, మహమ్మదీయసభ్యులెక్కువగాయున్న, శాసనసభయందు నెగ్గునని తలంచుట, కేవలమువనయాధునిక హిందూమతనాయకులయవివేకము పొరపాటు కావునమన హిందూమతనాయకులింకేమైన చిత్తుశాసనముల సదరుసభయందుప్రవేశపెట్టియుండినవానిని త్వరలో నుపసంహరించుకొనుటుత్తమోత్తమము మీదు మిక్కిలిబుద్ధిమంతుల లక్షణముఅనిరి.

శాసనసభయందధిక సంఖ్యగానున్నవారు మహమ్మదీయులేయగుటచేత యీచట్టమురద్దుచేయబడినదేగాని. అవతారపురుషులునగు నీలకంఠము కృషిఫలితమెంతమాత్రమునుగాదు వీరుయత్నము సల్పినను. సల్పకుండినను సహజముగనీశాసనమురద్దుచేయబడియుండెడిదే ఇందేదిఘనతయులేదని స్పష్టీకరించిరి.

శ్రీనీలకంఠముగారు యీశాసనచట్టమునకు ప్రతికూలురై కృషియొనర్చుటకొక కారణముగూడగలదు. వైశ్యులకిది యమలులోనికి తేబడినమిగుల నష్టముగల్గును కాబట్టియే వీరుతమకులాభదాయకమును, పూర్వాచారమును నిలుపుకొనుటకుగాను శాసననిరోధయత్నమొనర్చిరే గాని ధర్మరక్షణము నకెంతమాత్రమునుగాదు. స్వలాభమందపేక్షగలిగియుండుట శ్లాఘనీయముకాదు అందుచేనిట్టిస్వలాభాకాంక్షులగు శ్రీగుప్తగారిని, ఈశ్వరావతారమనిగొనియాడుట కేవలమప్రశస్తము, మరియు దేవనిందయునగును. ఈలాటిముఖస్తోత్రములుచేయుట, చేయించుకొనుట అమాయకపు ప్రజల దుర్వ్యామోహంబున బడంద్రోయుటయు, దేశద్రోహమొనర్చుటయు, ఇయ్యదిమోసగాండ్ర లక్షణంబనియు ఘాటుగచెప్పి ఉపన్యాసమును ముగించిరి. అంతటసభసమాప్తమయ్యెను.

వి. రామారావు,

== ==

## మిర్యాలగూడెం

### ఆర్యసమాజ సమావేశము

(ఒకవిలేఖరి) ౨౫-౧-౪౧

విక్రమనామ సం॥ర పుష్య బ ౩౦ లు సోమవారంరోజున ఆర్యసమాజభవనములో శ్రీయుత చిల్లంచర్లలింగయ్యఆర్యగారి అధిపత్యమునసభతసమావేశముఅయి దాదాపు ౬౦ మందియువకులు ప్రవేశించిరి. యస్. లచ్చయ్యగారు వ్యాయామమునుగూర్చియు, వయోజనపాఠశాలనుగురించియు విపులముగా ఉపన్యసించిన తదుపరి ఆంధ్రగ్రంథాలయము, ఆర్యసమాజ భవనము, నూతనగృహప్రారంభోత్సవము జరుపుటకు తీర్మానించిరి. నూతనగృహ ప్రారంభోత్సవము మాఘ శు ౫ లు బుధవారంరోజు ఏర్పాటుచేసిరి. మాసమురోజులక్రితమే వయోజనపాఠశాలస్థాపించియుంటిమి. దాదాపు నూర్గురు విద్యార్థులకు స్థలమిచ్చుచుంటిమి. గ్రామ సోదరులందరు ఈవయోజనపాఠశాల అభివృద్ధికై పాటుపడెదరని ఆశించుచుంటిమి. రాములు ఆర్యగారిచే భజనావళి జరిగిన తదుపరి సభ ముగిసెను.

— —

బొంబాయిలోని

## దయానంద అనాథ ఆశ్రమము

### నిజామాబాదుకు యిచ్చినవిరాళము

శ్రీమతి సౌభాగ్యవతి ధర్మఅనాథప్రియ గాజుల లాలమ్మదేవిగారు అంతఃకరుణతో రు ౫౦౦-౦-౦లు అయిదునూర్ల రొక్కమందానముయిచ్చినది ఈ మెయింతవరకు యెన్నో ధర్మసంస్థలకు సహాయంచేసినది హైదరాబాదుస్టేటు ఆర్యసత్యాగ్రహములో చాలాసహాయంచేసినది. కొన్ని ధర్మశాలలుకూడాకట్టించెను, యెన్నియో అనాథల పెండ్లిండ్లుచేసినది.

౨ అనాథప్రియధర్మ గు ర్రి పు సీరయ్యా నాగయ్యగారి ధర్మపత్నిగారైన అనాథరక్షఅభిమాని శ్రీమతిరాజమ్మదేవిగారు గృహఖర్చులలోమిగిల్చి అనాథులకొరకు సమర్పించిన రూ ౧౫౩-౧౧-౩ లు నూటయాభైమూడు పదకొండుఅణాలు మూడుపైసలు రొక్కమందానము యిచ్చినది. ఈశ్వరుడువీరలయొక్క కుటుంబములను ఆశీర్వదించుగాక. వీరికిమంచిబుద్ధియెల్లప్పుడుయిచ్చుగాక.

డి. వి. స్వామి, ఆర్యప్రచారకు
దయానంద అనాథఆశ్రమము
నిజామాబాదు

— —

# గోలకొండపత్రిక

విక్రమనామసం॥ర పుష్య శు॥ ౩

గురు వారము


# విద్యామహాసభా తీర్మానాలు

గత సంచికలో వరంగల్‌లో జరిగిన విద్యామహాసభలో అధ్యక్షులైన స. కమాల్ యార్జంగు బహద్దరుగారు ఇచ్చిన అధ్యక్షోపన్యాసమునుగురించిచర్చించియుంటిమి. తర్వాత ఒకటిరెండు ఉర్దూపత్రికలలో అచ్చటి కొన్ని తీర్మానములను జూడకలిగితిమి. వాటినిచూడగా చర్చింపవలసిన అనేక విద్యా సమస్యలపై చర్చ జరుగలేదని తోచుచున్నది. ఈ మహాసభవారిదృష్టిలో ముల్కీభాషల కేస్థానముండవలెనో అదిస్పష్టముకాలేదు. ఉర్దూభాష మాతృభాషగా కలవారికది అనవసరమగు సంగతిగా ఉండవచ్చునేమో కాని ఆంధ్ర, మహారాష్ట్ర, కర్ణాటకులకదియే ప్రధానమైన సమస్యగా ఉన్నది. ఉర్దూపత్రికలలో తీర్మానములన్నియు ప్రకటింపబడలేదు. ఈసమస్యపై ఏమైన తీర్మానములుచేసిరోలేదో చెప్పజాలము. ఈమహాసభవారు ఆహ్వాన సంఘాధ్యక్షునియొక్కయు, అధ్యక్షునియొక్కయు ఉపన్యాసములను, తీర్మానములను, నివేదికను, జరిగిన కార్యక్రమమును అన్నిపత్రికలకు ఇచ్చినట్లు కానరాదు. ప్రజాభ్యుదయానికి పనిచేయుసంస్థలు పత్రికలసహాయము నపేక్షించుచుండగా వీరుపేక్షించుచుండుట విచిత్రముగా ఉన్నది.

ఈసభవారు కావించిన తీర్మానములలో ఒకటి ప్రాథమిక విద్యావ్యాప్తిని గురించి చేయబడినది. "ప్రాథమికవిద్యను వెనువెంటనే నిర్బంధముగా చెప్పించుటకును, ప్రతిగ్రామములో ఒక పాఠశాలయైనను ఉండునట్లు ఏర్పాటుచేయుటకును ప్రభుత్వమువారిని యీ మహాసభ కోరుచున్నది" అని తీర్మానించినారు. ఈరాష్ట్రములో ౨౧౮౩౦ గ్రామాలుకలవు. అందిప్పుడు ప్రభుత్వమువారి మొన్నటి, అనగా ౧౩౪౮ ఫసలీ సంవత్సరపు నివేదికప్రకారము ౬౧౮౯ గ్రామాలలో పాఠశాలలున్నవని తెలిపినారు. అనగా యింకను ౧౫౬౪౧ గ్రామములలో బళ్లు లేవన్నమాట. ఈ లెక్కప్రకారము నూటికి ౨౮ పాళ్ల గ్రామాలలో పాఠశాలలు కలవనియు, నూటికి ౭౨ పాళ్ల గ్రామాలలో బళ్లులేవనియు చెప్పవచ్చును. ఈమహాసభవారు ప్రతిగ్రామములో ఒకపాఠశాలయైనను ఉండవలెనని చేసిన తీర్మానము చాలమంచిదిగా ఉన్నది. ఈ తీర్మానమును కార్యరూపములో నుంచునట్లు ప్రయత్నించవలెను. ఇప్పటి మన విద్యాధికారిగారు (నాజిం) చాల విశాలహృదయులును, విద్యావ్యాప్తికై మంచిపట్టుదల కలవారున్నై యున్నారు. అందుచేత వారి ప్రయత్నాలలో ఈ విద్యామహాసభవారు సహకారులుగా నుండుట సంభావనీయముగా ఉన్నది.

ఈ మహాసభవారు ఒకతీర్మానమును స్త్రీల విద్యాసంబంధములో చేసినారు. "మాధ్యమిక తరగతులలో స్త్రీల మాతృభాషలో విద్యచెప్పించుటకు నిర్ణయించినందులకు ప్రభుత్వమువారికి కృతజ్ఞత తెలుపుచు" ఈతీర్మానమును కావించియున్నారు. మాధ్యమిక తరగతులలో మాత్రమే మాతృభాషకు స్థానమిచ్చినందులకే వీరింత కృతజ్ఞతా బద్ధులైనప్పుడు ఉన్నత పాఠశాలలలోను మాతృభాషలో విద్యచెప్పించు నేర్పాట్లుచేసిన వీరింకను సంతోషించి మరింతకృతజ్ఞతను వెల్లడింపకుందురా? ఇదివీరి భావనైశాల్యముకుగురుతు. ఇంతవరకుప్రభుత్వమాధ్యమికోన్నత బాలికాపాఠశాలలలో కేవలముఉర్దూలోనేవిద్య చెప్పించుచుండిరి. ఆంధ్ర, మహారాష్ట్ర, కర్ణాటక స్త్రీలయిబ్బందులను ఈమహాసభవారుగుర్తించినందుకు వారికి కృతజ్ఞత తెలుపుకొనదగినదిగా ఉన్నది. అయితే యీతీర్మానములో తెలిసియో తెలియకయో ఒక వాక్యమును వదలివేసినారు. ఈబాలికా మాధ్యమిక పాఠశాలలలో ఉర్దూను నిర్బంధ ద్వితీయభాషగా చదివించుటకు ప్రభుత్వమువారు శాసించినారు. ఈనిర్బంధమును తొలగించుటకై తీర్మానములో ఒక చిన్నముక్కనుచేర్చితే బాగుండేది.

ఈలోపముతో కూడిన తీర్మానమును వరంగల్ ప్రసిద్ధవకీలుగారును ఆంధ్రమహాసభ స్థాయిసంఘానికి అనేక సంవత్సరాల నుండి ఉపాధ్యక్షులుగా నున్నవారును అయిన మాదిరాజు రామకోటీశ్వరరావుగారు ప్రవేశపెట్టినారు. ఆంధ్రమహాసభాధ్యక్షులు ఇటీవలనే ఈ విద్యామహాసభలో ఆంధ్రమహాసభ కార్యకర్తలుచేరవచ్చునా లేదా అనువిషయమును తమ కార్యకారిణీసభలో చర్చింపజేసి "అది విద్యామహాసభ అయినందున కార్యకర్తలుచేరుట చేరకపోవుటవారి స్వేచ్ఛపైన ఆధారపడినదనియు, కాని విద్యావిషయములలో ఆంధ్రమహాసభలలో ఇంతవరకు చేయబడిన తీర్మానములతత్త్వమునకు వ్యతిరేకమైన తీర్మానములు ఈవిద్యామహాసభలో వచ్చినచో ఆంధ్రమహాసభా తీర్మానములతత్త్వమునే వాదించవలెననియుసభవారు అభిప్రాయపడిరి" అని ప్రకటించియుండిరి. బాలికలమాధ్యమికపాఠశాలలలో ఉర్దూనిర్బంధము ఆంధ్రమహాసభాతత్త్వానికి అనుకూలమైనట్టిదా లేక వ్యతిరేకమైనట్టిదా? అనుకూలమైనదని తెలిపినచో రామకోటీశ్వరరావుగారు పైతీర్మానాన్ని ప్రతిపాదించుటసవ్యముగా ఉన్నదనవలెను. వ్యతిరేకతత్త్వమే అని నిర్ణయించుచో పై రావుగారిపై ఏమైనచర్య పుచ్చుకొనవలసియుండునోయేమో అని కార్యకారిణీసభవారి చిత్తములోని మాట!

ఈ వరంగల్ విద్యామహాసభలో చాలగొప్ప అధికారులుకొందరు ఉపన్యసించినారు. ముందురానున్న ప్రజావిద్యామహాసభలోను ప్రముఖులను, మహాఅట్టివారిని ఆసభవారు ఆహ్వానించవలెను. ఆహ్వానించినచో వారు అప్పుడును తమ భావములను ప్రకటించి ఉపకారులగుదురని ఆశించుచున్నాము.

—

## వరంగల్లు జిల్లా ద్వితీయ ఆంధ్రజన మహాసభ

—

అధ్యక్షులవారి ఎన్నిక

—

మనుగోట, ౨౩-౪-౩౦

నేడు వరంగల్ జిల్లా స్థాయిసంఘసభ్యులును, ఆంధ్రజిల్లా ఆహ్వానసంఘ సభ్యులును మరియు కొందరు తాలూకాసంఘాధ్యక్షులును యిచ్చట శ్రీయుత కొమురగిరివేంకటేశ్వరరావు, హైకోర్టు వకీలు మరియు ఆహ్వానసంఘాధ్యక్షులుగారి భవనమందుసమావేశమయి కేంద్రసంఘమువారు ప్రచురించిన నియమావళిననుసరించి వరంగల్ జిల్లా ద్వితీయాంధ్రమహాసభాధ్యక్షుని ఎన్నికవిషయము స్థలము మరియు తేదీనిర్ణయ సందర్భములపైనను సమాలోచన మొనర్చిరి. ఈ సమావేశమునకు స్థానిక ఆహ్వానసంఘ కార్యకర్తలును మరియు యితర అభిమానులగువారును విచ్చేసిరి.

అధ్యక్షునిఎన్నికవిషయమై తాలూకా నగర సంఘములనుండి అభిప్రాయములు వచ్చియుండెను. కావునజిల్లా స్థాయిసంఘముయొక్క బహుళసభ్యత్వాంగీకారమును పొందినపిదప అభ్యర్థులుగానిలువబడిన శ్రీయుత మాదిరాజురామకోటీశ్వరరావుగారికిని మరియు, శ్రీయుత పర్చారంగారావుగారికినివచ్చిన వోట్లసంఖ్యను లెక్కింపగా శ్రీయుత పర్చారంగారావుగారికి (౬)వోట్లును మరియు శ్రీయుతరామకోటీశ్వరరావుగారికి (౪)వోట్లునువచ్చినందున సిద్ధాంతమునసుసరించి శ్రీయుతపర్చా రంగారావుగారే ద్వితీయాంధ్రజిల్లాసభాధ్యక్షులుగా ఎన్నుకొనబడినట్లు నిశ్చయింపబడినది

ఈసందర్భమున సమావేశమునకువచ్చినప్రముఖులందరును ఈమలపూసపల్లిగ్రామమువరకు శ్రమయనకవచ్చి సభానగరనిర్మాణము మొదలుగాగలవిషయములందు మాకు ఉచితమైనసలహానొసంగినందులకు కృతజ్ఞులము.

ఇంతేగాక రాబోవుద్వితీయాంధ్రజిల్లా మహాసభ ౭-౯-౧౦ ౧౩౫౦ఫసలీతేదీలలో వైస్థలము నందేజరుపుటకు నిశ్చయింపబడినది.

కో॥ నారాయణరావు.

[ఏనెలలోజరుగునో తెలుపలేదు గో. ప.]

—

## చందూరుపట్టె గ్రామాధికారుల సంఘము

(ఒక విలేఖరి)

౨౪-౪-౫౦ తేదిన అత్రాపుబల్దా జిల్లాతాలుకపర్కిలో చేరినదోనిపాములగ్రామమున శ్రీస్వామీరావుగారిగృహమున పాల్వాయినార్సింహారెడ్డి అధ్యక్షులు సిద్దెపల్లి రాంరావు ఉపాధ్యక్షులు పులిజాలహనుమంతరావు కార్యదర్శి మద్దినారాయణరెడ్డి, కోశాధిపతి పులిజాలస్వామీరావు, కుంభంరాంరెడ్డి వేముగంటి శ్రీనివాసరావుగారలుగల నూతనకార్యవర్గంతో తమనవమ సమావేశం ౨౦ సభ్యులతోను యింకా ఇతర ప్రముఖులతోను జయప్రదంగాజరిపి, తమపట్టి గ్రామాధికారులంతా గౌరవప్రదంగా, సకాలములో పనులునిర్వర్తించునట్లు చూచుటకు పైముగ్గురుజిగ్నజెజ్గను నియోగించి, వారుచేయవలసినప్రణాళికసిద్ధపర్చి మొత్తంగ్రామాలను విభజించియిచ్చిరి. యింకాసభ్యులలోగల వైషమ్యాలతొలగించి అందరికి ఐకమత్యంకలిగించు తమ నిర్మాణకార్యక్రమం ప్రారంభించిరి. యీవిధానం యితరగ్రామాధికారులందరికి ఆదర్శప్రాయమై వారుకూడ అక్కడక్కడ యిదేవిధానమవలంబించెదరని ఆశించుచున్నాము.

—

మహిబూబు కాలేజీలో సభ

సికింద్రాబాదు (దక్కన్), ఇక్బాలుదారు ౨౯ ప్రకాశిత మహావిద్యాపీఠాధ్యక్షులగు శ్రీదంటు సుబ్బావధానులుగారు యీదినం (సోమవారము ౩వ ఫిబ్రవరినాడు) సాయంకాలము ౬ గంటలకు సికింద్రాబాదు మహిబూబుకాలేజిలో ఆంధ్రరాజులవారి కళాపోషకత్వము అను విషయాన్ని గూర్చి ఉపన్యసింతురు.

—

బాలాజీదేవళము

హైదరాబాదు (దక్కన్), ఇస్ఫందారు ౨౯ హైదరాబాదునగరములోని బాలాజీదేవాలయమునకు ప్రొఫెసర్ గారికి యుద్ధసహాయనిధికి ౩౫౦ రూపాయలిచ్చినారు. ఆదేవాలయములో ౨ మాసాలనుండి యింగ్లీషువారికి జయముకలుగుటకై రామాయణ పారాయణము జరుగుచున్నది.

—

## శ్రీమాతృభారతీజయంతి

—

పైజయంతి ౩౧-౧-౪౧వతేది హైదరాబాద్ బాలికలఉన్నత పాఠశాలాభవనమున శ్రీమతి సేనానిభారతీ రత్నాకరాంబగారి యాజమాన్యమున జరిగెను. సభకు శ్రీ శ్రీ రాజబహద్దరు వెంకటరామారెడ్డిగారు దయచేసియుండిరి. అధ్యక్షులవారి ప్రారంభోపన్యాసముతో సభప్రారంభమై జయప్రదముగా నిర్వహింపబడెను. పాఠశాలబాలికలు నాట్యము, తామువ్రాసినపద్యముల జదువుట, వరవిక్రయనాటకప్రదర్శనమునున్న గువిషయములచే సభనురంజింపగల్గిరి. సభావసానమున గవర్నమెంటు చాదరఘాట్ స్కూలు ప్రధానాంధ్రోపాధ్యాయులగు శ్రీఆదిరాజు వీరభద్రరావుగారు పాఠశాలావిద్యార్థినుల నభినందించుచు ముఖ్యముగాఈపాఠశాలను సర్వవిధముల నభివృద్ధికిదెచ్చిన శ్రీమాడపాటి హనుమంతరావుగారు ప్రశంసార్హులనియు, వారికి ఈపాఠశాలాభివృద్ధి సందర్భమున కల్పవృక్షమువలె శ్రీరాజబహద్దరుగారు దొరకిరనియు శ్రీరాజబహద్దరుగారి కరావలంబముచేతనే ఈపాఠశాల యిట్టియభివృద్ధిగాంచి యీనాడింత రంజింపజాలినదనియు నుడివిరి. సభముగిసెను,

—

నిజామాబాదుసభ

హైదరాబాదు (దక్కన్), ఇస్ఫందారు ౨౯ నిజామాబాదులో ౧౧వ జనవరినాడు హిందూప్రజామండలిసభ జరుగవలసియుండెను. కాని ప్రభుత్వానుమతిదొరకనందున ఆగిపోయెను ఇప్పుడు హోంసెక్రటరీగారితో మండలి నాయకులు కలిసి అనుమతికై ప్రయత్నించుచున్నారని తెలియవచ్చుచున్నది.

ఔరంగాబాదులో విమానస్థానము

ఔరంగాబాదునకు ౬ మైళ్ళదూరములో ఉన్న చిక్కల్‌టాసా అనుస్థలములో ౧ లక్షకుమించినపైకమును వ్యయముచేసి విమానాలుదిగుటకై మైదానమును ప్రభుత్వమువారు ఏర్పాటుచేసినారు.

—

కరీంనగరులోవిద్యావ్యాప్తి

విద్యాశాఖవారు విద్యావ్యాప్తిచేయు కృషిలో ఈసంవత్సరము కరీంనగరుజిల్లాలో ౨లక్షలరూపాయలు ఖర్చుపెట్టి ౩౫ క్రొత్తపైసుకూల్బళ్ల భవనాలుకట్టించనున్నారు.

—

## బ్రిటను, జర్మనీల బలాబలాలనుగూర్చి రష్యా అభిప్రాయము

"బ్రిటనుమీద దండయాత్రజరపడానికి ప్రయత్నిస్తే జర్మనులు తీవ్రమైనచిక్కులను ఎదుర్కొనవలసిఉంటుంది" అనిసోవియటుమిలిటరీ పత్రిక "రెడ్ స్టార్"లోఒకవ్యాసంలోవ్రాయబడినది.

"జర్మనుమిలిటరీయంత్రము శక్తివంతమైనదే కాని దిట్టమైన బ్రిటిషుయుద్ధనౌకాదళాల రక్షణక్రిందఉన్న ఇంగ్లీషుఛానెల్‌ను దాటగలిగినంతశక్తి దీనికిఉన్నట్లుకనబడదు. దండయాత్రాప్రమాదం ఇప్పటికీ ఉంటున్నదికాని బ్రిటనుప్రతిఘటన ౧౯౪౦ మేనెలలోకంటె ఇప్పుడుదృఢతరంగాఉన్నది, దండయాత్రను జయప్రదముగా నిర్వహించాలంటే జర్మనీకి బ్రహ్మాండమైనబలం కావలసిఉంటుంది" అని ఆవ్యాసకర్త వ్రాసినాడు.

"బ్రిటిషువారు సంప్రదాయానుగతమైనరక్షణవిధానంవదలిపెట్టి తామేదెబ్బతీయడానికి సన్నాహాలుచేశారు. బ్రిటిషుమిలిటరీయంత్రం. గట్టిదెబ్బలుతిన్న అనుభవముతో ఎదురుదాడికి సంసిద్ధమయింది. సిడ్డీబరానీమీద బ్రిటిషువారు దాడిజరిపినప్పుడు చాలామందిపరిశీలకులుదానికిఎక్కువమిలిటరీ ప్రాముఖ్యంయివ్వలేదు కాని బ్రిటిషుసైన్యాధికారులు పాఠాలునేర్చుకోవడంలోమంచినేర్పుచూప ఆధునిక యుద్ధపద్ధతుల ప్రకారం విజయవంతముగా పురోగమనం సాగించిరి. దిట్టమైన ఇటాలియరక్షణలు ఈపురోగమనాన్ని అడ్డగించలేకపోయినవి" అని యితడువ్రాసినాడు.

తూర్పుఆఫ్రికాలో ఇటలీపరిస్థితి

తూర్పుఆఫ్రికాలో ఇటలీపరిస్థితిమీద వ్యాఖ్యానిస్తూ ఒకరష్యాపత్రిక బ్రిటనుఇటీవల లభించినవిజయాలవల్ల ఇటలీపరిస్థితి చాలాచిక్కులలోపడిందనివ్రాసింది. బ్రిటను తనరక్షణవిధానంవదలి దెబ్బతీయ్యడం మొదలుపెట్టిందనీ. యుద్ధప్రారంభంలోవలెకాక బ్రిటిషుమిలటరీయంత్రంఇప్పుడు ఆఫ్రికా రంగంలో తనరకంగా దెబ్బతీస్తున్నదనీ ఈపత్రిక వ్రాసినది.

—

## హైదరాబాదు బజారు ధరలు

తేది ౧-౫-౫౦ ఫ.

పల్లా ౧కి ౧౨౦ సేర్లతూకము.

ధరలన్నీ హాలీలే.

| బియ్యము | పల్లా ౧కి ధర రూ | అ | పై |
|---|---|---|---|
| కిచిడీసాంబర్లు | ౨౫ | ౦ | ౦ |
| సంబాస్లు | ౨౩ | ౮ | ౦ |
| ఢిల్లీతోగాలు | ౨౩ | ౦ | ౦ |
| రాంసాగర్లు | బజారులోలేవు | | |
| నానక్రోం | ౧౪ | ౦ | ౦ నుంచి |
| | ౨౧ | ౮ | ౦ వరకు |
| అర్కాటి | ౧౬ ౧౬ | ౮ | ౦ (కొత్తవి |
| | ౨౧, ౨౦ | ౮ | ౦ పాతవి |
| కోనామణి | ౧౫ నుండి ౧౮ వరకు | | |
| బుడుములు | ౧౪ | ౮ | ౦ |
| దేశావరి | ౧౫ | ౮ | ౦ |
| గోధుములు | ౧౯ | ౮ | ౦ |
| బన్సీ | ౧౭ | ౦ | ౦ |
| లమ్కారీ | ౧౮ | ౦ | ౦ |
| పోటియో | ౧౬ | ౦ | ౦ |
| ఎర్రగోధుములు | ౧౫ | ౦ | ౦ |
| జొన్నలు | ౧౦ | ౦ | ౦ |
| తెల్లజొన్నలు | ౧౦ | ౪ | ౧ |
| పచ్చజొన్నలు | ౮ | ౦ | ౦ |
| మడికట్టుజొన్నలు | ౬ | ౮ | ౦ |
| సెనగలు | ౧౨ | ౬ | ౦ |
| కందులు | ౮, ౧౦ | ౬ | ౦ |
| మినుములు | ౯ ౧౨ ౦ నుంచి ౧౦ | ౮ | ౦ |
| లంకలు | ౧౦ | ౧౨ | ౦ |
| సజ్జలు | ౬ | ౪ | ౦ |
| వసుములు | ౬ | ౧౨ | ౦ |
| పప్పు | | | |
| సెనగపప్పు | ౧౫ | ౮ | ౦ |
| కంది ,, | ౧౪౦ | | ౦ |
| సిరిసెనగ ,, | ౧౯ | ౦ | ౦ |
| లంక ,, | ౧౧ | ౪ | ౦ |
| మినప ,, | ౧౭ | ౦ | ౦ |
| పెసర ,, | ౧౮ | ౮ | ౦ |
| బెల్లము | ౧౦ ౦ ౦ ౧౧ | ౦ | ౦ |
| ఉప్పు | ౧౩ | ౦ | ౦ |
| వుల్లిగడ్డ | ౧౧ | ౧౨ | ౧౩ వరకు |
| తెల్లచదుకు | ౧౨ నుంచి | ౨౦ వరకు | |
| చక్కెర మణుగుకు (౪౦ సే) | | | |
| జావా ,, ,, | ౧౪ | ౦ | ౦ |
| బొంబాయి ,, ,, | ౧౩ | ౧౪ | ౦ |
| మద్రాసు ,, ,, | ౧౩ | ౧౫ | ౦ |
| నిజామాబాదు,, ,, | ౧౩ | ౧౨ | ౦ |
| పిరచక్కెర ,, పల్ల | ౧౩, ౧౨ | ౮ | ౦ |
| దరాచక్కెర ,,(౪౦ సే) | ౧౬ | ౧౨ | ౦ |
| ఎల్లిగడ్డ ,౧౨సే | ౫ | ౧౨ | ౦ |
| అల్లం ,, ,, | ౧ | ౧౨ | ౦ |
| మణుగు ౧౨ సే | | | |
| కొబ్బరినూనె | ౪ | ౮ | ౦ |
| పసుపునూనె ,, | ౩ | ౫ | ౦ |
| నువ్వులనూనె ,, | ౩ | ౧౨ | ౦ |
| వేరుసెనగనూనె ,, | ౨ | ౧౪ | ౦ |
| పుంటినూనె ,, | | | |
| కిరోసిన్ (గ్యాస్),, డబ్బా ౧ కి | | | |
| నెయ్యి మణుగుకు ౪౦ సే | | | |
| బిరుసనెయ్యి ,, ,, | ౪౨ | ౦ | ౦ |
| తెలంగానా ,, ,, | ౩౯ | ౦ | ౦ |
| వనస్పతి డబ్బా ౧ కి | ౧౧ | ౨ | ౦ |
| బంగారు తు ౧ కి | ౫౭ | ౪ | ౦ |
| వెండి ౧౦౦ తు | ౬౯ | ౨ | ౦ |
| తు ౧కి | ౦ | ౧౧ | ౨ |
| సవరిన్ ౧ కి కల్దారు రూ | ౨౮ | ౮ | ౦ |
| నూరకం | | | |
| హాలికి కల్దార్లు | ౧౫ | ౧౩ | ౦ |
| కల్దారుకు హాలీలు | ౧౫ | ౧౧ | ౦ |
| ఆముదాలు బస్తా | ౧౧ | ౪ | ౦ |
| వేరుసెనగ | ౭ | ౪ | ౦ |
| బుడ్డలు పల్లా ౧కి | ౭ | ౪ | ౦ |
| పప్పు పల్లా౧కి | ౧౨ | ౦ | ౦ |

గమనిక: —

ధరలు వీలైనంతవరకు సరియైనవిగా తెలుపుచుందుము. అయినను ఏమైన పొరపాట్లుండిన దానికి పత్రికవారు బాధ్యులుకాజాలరు. ఈ. నగరాలలో జిల్లాలలో వ్యాపారపు పేటలలోని గొప్పవర్తకులు తమసరకులప్రకటనలు మా పత్రికలో వేసికొనినవారి వ్యాపారానికి మంచిప్రచారము కలుగును.

—

## పరోపకారిణి బాలికాపాఠశాల

(సికింద్రాబాదు-దక్కన్)

### శ్రీగద్వాల మహారాణిగారు దర్శించుట.

శ్రీగద్వాలరాణిగారు ఈనెల౨౭వ తేదిని పరోపకారిణి బాలికాపాఠశాలనుసందర్శించిరి. ౨౭వ తేది శెలవుదినమయినను శ్రీమహారాణిగారి సందర్శనార్థము పాఠశాల తెరువబడియుండెను. శ్రీమహారాణిగారు మధ్యాహ్నం ౨-౩౦గంటలకు పాఠశాలకువిచ్చేసిరి. మోటారుదిగినతోడనే పాఠశాలబాలికలు "శ్రీ మహారాణిగారికి" జై. అనుశబ్దములతో శ్రీమహారాణిగారి నాహ్వానించిరి.

కార్యక్రమము ప్రార్థనతో ప్రారంభింపబడెను. తదుపరిఆహ్వానపద్యములను, భారతమాతదేశీయకీర్తనలను, పాఠశాలస్థాపకురాలును, కీర్తిశేషులగు శ్రీమతిసీతమ్మగారిమీదకీర్తనల పాఠశాలబాలికలు పాడిరి. శ్రీమహారాణిగారు పాఠశాలపిల్లలుమృదుమధురయుచ్చారణలతోను, ధైర్యముతోను, కీర్తనలబాడుచుండ చాలసంతసించిరి. పాఠశాలబాలికలు కీర్తనలతో కోలాటమునువేసిరి. వారికీర్తనలమాధుర్యమూవరణమంతయునావరింపబడి, ప్రేక్షకులనానందమగ్నులజేసెను.

తరువాత నృత్యముప్రారంభింపబడెను. నృత్యసందర్భమున బాలికలనటనాకౌశలముకు శ్రీమహారాణిగారు చాలసంతసించిరి. తదుపరిచర్ఖాపై బాలికలహస్తలాఘవమును, అప్రయత్నతతో దారమునుతీయుటయును, గొనియాడిరి. సదరుపాఠశాలబాలికలు ౪౦వనంబరుదారమువరకు వడకగలరని వారుతెలిసికొని చాలసంతోషించిరి. అంత పాఠశాల నివేదికనున్కాలు సూపరింటెండెంటుగారగు శ్రీమతిశకుంతలమ్మగారిచే తెలుగునచదువబడెను. తదుపరి సందర్భానుసారముగ కృతినొనరింపబడిన తెలుగునవరత్నపద్యములు చదువబడెను. అటుపిమ్మట శ్రీమహారాణిగారు బాలికలయొక్క చేతికుట్టుపనులజూచి చాలకొనియాడిరి. కార్యక్రమమునందు చివరయంశము బాలికలవ్యాయామము, బాలికలు సదావ్యాయామపరిశ్రమను నలవడియుండుటచే, ఈలచేవారికి వెలిపింపబడువిధులనుబట్టి కపముగవ్యాయామవిధుల గడునేర్పుతో నెరవేర్పగలిగిరి. శ్రీమహారాణిగారు సదరుపాఠశాల ముఖ్యావసరస్థానమును కీర్తిశేషులగు శ్రీమతి సీతమ్మగారిచే స్థాపింపబడుటయు, ఆపాఠశాలకుగాను శాశ్వతముగ భవననిర్మాణము ను కీర్తిశేషులగు రావుబహద్దరు ముష్త్యాల వెంకటకృష్ణయ్యగారుచిరస్థాయిగ జేయుటయు, సదరుపాఠశాలకు నిరంతర ప్రోద్బలమును శ్రీమాన్ వకీలుతాతాచారిగారు సదాయిచ్చి పాఠశాలను ప్రస్తుతదశకు దెచ్చుటయు చాలశ్లాఘనీయమని గొనియాడిరి.

పాఠశాలచే నొనరింపబడుచున్న నిరంతరశ్లాఘనీయమైన కృషినిచూచి, సంతసించి శ్రీ మహారాణిసాహెబా వారు పాఠశాల బాలికలకు పండ్లు, మిఠాయిపంచునిమిత్తమును, పాఠశాలయుపాధ్యాయుల బహుమానముక్రిందను తదితరయేర్పాటులకును (౧౦౦) నూరు రూపాయిల దానమును పాఠశాలకునిచ్చిరి. తదుపరి వారు తమమోటారులో సాయంత్రము ౬ గంటలకు జయజయధ్వనులొనరించుచుండ, పాఠశాలసందర్శనా కుతూహలముతో వారిభవనమునకేగిరి.

పాఠశాలబాలికలకు మిఠాయియు, పాఠశాలయుపాధ్యాయినులకు చీరలు, రవికగుడ్డలను, పాఠశాలలో సంగీత,వ్యాయామముల నేర్పు యుపాధ్యాయులకు పంచెలసాపులను శ్రీగద్వాల మహారాణిగారికోరికపై వారుయిచ్చిన దానము నుండి ౨౭వతేది సోమవారమున పంచిపెట్టబడెను.

భగవంతుడు శ్రీ గద్వాల మహారాణిగారికి శాశ్వతాయురారోగ్యైశ్వర్యముల జేకూర్చుగాక!

ఇట్లు
ఎస్. శ్యామరావు.



## ఆర్యసామాజికులకు సావర్కారుగారి హెచ్చరిక

### జనాభాలెఖ్ఖలలో 'హిందువు'అని స్పష్టంగా వ్రాయండి

బొంబాయి, జనవరి ౨౭

హిందువుల జనాభాలెఖ్ఖలలో ఆర్యసమాజిస్టులు 'హిందువు' అనితెలియచెయ్యరు, అందుచేత ఆర్యసమాజీయులు, జనాభాలెక్కలలో "హిందువు"అని తెలపవలసినదని విజ్ఞాపనచేస్తూ హిందూమహాసభాధ్యక్షుడు వి. డి. సావర్కారుగారు ప్రకటనచేశారు. అందులోఇంకను ఇట్లుతెలియచేసిరి.

"కొంతమంది నాయకులు ఆర్యసమాజికులు జనాభాలెక్కలలో హిందువు అనేపదముచేర్చకపోయినా ఆర్యసమాజికులందరినీ హిందూజనాభాలెక్కలలోనే చేర్చుతామని ప్రభుత్వము చెప్పినదనుచున్నారు. కాని ఇందులోఒక పెద్దచిక్కు ఏర్పడునుందేమో ఆర్యసమాజికులందరు వేరేమత వారుగాని, హిందువులుకారని ప్రభుత్వంఅంటేఅనవచ్చును. ఇదేరీతిగా సిక్కులను కొంతవరకు హిందువులనుంచి వేరుచేసియున్నారు.



## ఇంగ్లాండు స్పెయినుల సంభాషణలు

బ్రిటనులో విదేశాంగమంత్రిపదవికి ఆంథోనీ ఈడెన్ వచ్చినతరువాత జనవరి౨౨వతేదికామన్సు సభలో మొట్టమొదటిప్రశ్నకు జవాబిస్తూ, ఇటీవల టాంజీరులో స్పెయిను పరిపాలనకుసంబంధించిన చర్యపై స్పెయినుతో బ్రిటిషుసంప్రతింపులో "కొంతఅభివృద్ధిస్పష్టంగాకనపడుతున్న"దని తెలియజేసినాడు, అంతసమాధానం కుదిరేవరకు టాంజీర్ అంతర్జాతీయమండలంలో బ్రిటిషు హక్కులు ప్రయోజనాలవిషయమై, ఒక తాత్కాలికమైన ఏర్పాటుచెయ్యడంకోసం మాడ్రిడ్ లో చర్చలు జరుగుతున్నాయని ఈడెన్ జప్తిచేసెను. ఈ చర్చలు సంతృప్తకరంగాసాగుతున్నాయనెను. "దీనికి సంబంధించినసంగతులన్నిటిపై చర్చ ఇంకాపూర్తికాకపోయినను అంత్యసమాధానముకుదురువరకుఈలోపున ఆమండలంలో బ్రిటిషుప్రజలుఅనుభవిస్తున్నట్టి ప్రస్తుతహక్కులకు రక్షణవుండవలసిన అవసరములేనంత అభివృద్ధికనబడుతున్నది" అని ఈడెన్ చెప్పెను.

ఈసంప్రతింపులగూర్చి ఈడెన్ త్వరలోనే ఒకపూర్తిప్రకటనచేస్తాననెను. ఇప్పుడు టాంజీరులో ఇటాలీయజలాంతర్గాములు ఎక్కడాలేవనెను.

### అమెరికావారికి విమానాశ్రయం

బెర్ముడాద్వీపాలలో మోర్గాన్, టకిర్ అనే రెండుద్వీపాలను సముద్ర విమానాశ్రయాలుగా ఉపయోగించుకోసం అమెరికా గుత్తకు తీసుకుంటుంది.

బ్రిటిష్ వెస్టుఇండీస్ లో బెర్ముడాలో కొన్నిస్థలాలను సముద్ర విమానాశ్రయాలకోసం అమెరికా గుత్తకుతీసుకోడానికి ఒప్పుదలకుదిరినప్రకటన చేయబడినప్పుడు, బెర్ముడాలో మరిఒకటిరెండు ద్వీపాలనుగూడా అమెరికాకోరియుండెననీ,ఈ రెండుద్వీపాలవిషయమై ఇప్పుడు ఒప్పుదల కుదిరిందని, ప్రకటన చేయబడినది.

## 'డెయిలీ వర్కర్' ఆపబడుట

బ్రిటనుదేశరక్షణ నియమాలక్రింద బ్రిటిషుప్రభుత్వంవారు ప్రముఖ బ్రిటిషుకమ్యూనిస్టు వార్తాపత్రికయను "డెయిలీ వర్కర్" ప్రచురణమును నిలిపివేసిరి.

"దివీక్"అనే మరొక సామ్యవాదపత్రికను కూడా ప్రభుత్వము నిలిపివేసినది. యుద్ధనిర్వహణాన్ని జయప్రదంగా కొనసాగించడానికి ప్రతిబంధకాలను కలిగించువిషయాలను ఈ పత్రికలు పనిగాపెట్టుకుని ప్రకటిస్తున్నవని దేశీయశాఖామంత్రి ఆక్షేపణవల్ల ఇట్లు చేయబడినది.

"డెయిలీవర్కర్"ను అణచివేయడమునుగూర్చి కామన్సుసభలోప్రశ్నవేళలో ఒకచిన్నచర్చ జరిగినది.

హోంసెక్రెటరీ హెర్బరుమారిసన్ ప్రత్యుత్తరమిస్తూ పత్రికాస్వాతంత్ర్యాన్ని కొన్నివేళలలో దుర్వినియోగపరిచే ప్రమాదంవున్నాకూడా దానిని కాపాడాలనే తనదృఢాభిప్రాయం అని అన్నారు, కాని అప్పుడప్పుడు అలాంటిప్రమాదాలను పాటించకుండా వుండడానికిన్నీ, మనదేశచరిత్రలో అత్యంతక్లిష్టమైనట్టి ఈపోరాటంలో విజయంపొందడానికి ప్రజలసంకల్పబలాన్ని చెడగొట్టేఉద్దేశ్యంతో ప్రకటించబడుతూవున్న వార్తాపత్రికలను సాగనివ్వడానికిన్ని, ఎంతోభేదంవుంది. బ్రిటన్ కు తనమిత్రరాజ్యాలకు, భావిగతివిషయమై నిర్లక్ష్యంచేస్తూ ప్రజాస్వామిక రాజ్యాంగ ప్రభుత్వాన్ని చెడగొట్టే పరిస్థితిని తెచ్చిపెట్టడానికే యీపత్రిక వుద్దేశించింది"అన్నాడు.



## హార్లిక్స్ కుపూర్వము ఏఆహారము పుచ్చుకొనుచుండలేదు

104 డిగ్రీల జ్వరమున్న ప్రమాదము. ఉష్ణతచేత దేహము మండుచున్నప్పుడు ఏఆహారము తీసుకొనకపోవుటచే అలసిన స్నాయువులకు తగుశక్తి నివ్వకపోవడము మరింత ప్రమాదకరము. డాక్టర్లు ఆహారపు సంశయమును తీర్చినారు. హార్లిక్స్ తగుమైన ఆహారమని రుజువుచేయబడినది. ఇతరాహారములన్న అసహ్యము. హార్లిక్స్ నిర్బలమైనకడుపుకు ఏలాటి హానికలుగజేయక సులభముగా జీర్ణమై, సకలావయవములకు తగుశక్తినిచ్చును. స్నాయువులను వృద్ధిపరచి నరములకు పటుత్వము కలుగజేయును. శ్లేష్మకాలములందు ఇతరరోగములురాకుండ రక్షించును. పెద్ద ఆస్పత్రులలో జ్వరపీడితులకు హార్లిక్స్ ఇచ్చు ఏర్పాటుచేసినారు. జ్వరముచే బాధపడి ఇప్పుడు ఆరోగ్యమును అనుభవించుచున్నవా రందరు హార్లిక్స్ ను అభినందించుచున్నారు.

## వస్త్రప్రదర్శనమునుగూర్చి ష.ష.వ నిజాంప్రభువుగారి అభిప్రాయము

### ప్రదర్శనములో ముల్కీ వస్తువులే యుండవలెను

హైద్రాబాదు (దక్కన్) ౨౬ ఇస్ఫందారు అన్యదేశముల వస్తువులను ఈ ప్రదర్శనమందుంచ గూడదు. ఈ దేశపు వస్తువుల యభివృద్ధికొరకై ప్రదర్శన మేర్పాటు చేయబడినది. ఇతర దేశముల వస్తువులనుంచినచో ముల్కీ వస్తువు అభివృద్ధికి రావు. హైదరాబాదు రాజ్యములో చేయబడిన అన్నివస్తువులు ప్రదర్శనములో నుంచినచో దేశీయులకు ఉత్సాహము కలుగును. బరారు హైదరాబాదు రాజ్యములో చేరినది గాన అక్కడి వస్తువులుంచవచ్చును. ఈ సంస్థానములలో సిద్ధమగు వస్తువులనుంచవలెను.

ఇకముందు ప్రదర్శనము ఒక నెలవరకు జరుగుచుండవలెను. జూబ్లీ ప్రదర్శనము జిలహేజ్ నెలలో జరిగినది. ఇదికూడ ప్రతిసంవత్సరము ౧ వ జిల హేజునుండి ౧ వ మొహరం వరకు జరిగినచో దావిజ్ఞాపకార్థము గానుండును. కోళ్ళప్రదర్శనము, తోటప్రదర్శనమును దీనిలోనే చేర్చవలెనుఅని ము-ఘు-వ-నిజాంప్రభువుగారు శలవిచ్చిరి. ప్రభువుగారు అటుపిమ్మట ప్రదర్శనములోని వివిధవస్తు జాలములను వీక్షించిరి.

## చీకటిలో లాఠీదెబ్బలు

హైదరాబాదు ఇస్ఫందారు ౨౮ తుల్జాప్రసాదు గారను ఆర్యసమాజపండితుడు ౨౫ ఇసఫందారు ౧౩౫౦ సోమవారమునాడు తమస్వగృహమునకు వెళ్లుచుండగా మార్గమధ్యములో అస్కర్ జంగుగారిదేవిడీ సమీపమందు ఒక ముసల్మానువ్యక్తి వెనుకనుండివచ్చి లాఠీతో కొట్టెను. వారుతిరిగుచూచునరికి ఇంకొకదెబ్బను కొట్టి వెడలిపోయెను. పండితులవారికి కుడిభుజముపైనను గడ్డముపైనను బలమగు గాయములు తగిలెను. అంధకారమగుటచే ఆవ్యక్తి చక్కగా కనపడకపోయెను. అవ్యక్తి తెల్లని షేరువానియు, తుర్కీటోపీయు. లాగునుధరించియుండెను. ఈ విషయమును వెంటనే, రేజుబజారుతానాపోలీసు కానిస్టబిలుకు తెలుపబడెను. మరియు కొత్వాలుగారికిని, ప్రధానమంత్రిగారికిని ఆర్యసార్వదేశిక సభఢిల్లీకిని రిజిస్టరుద్వారా తెలుపబడినది.

## జర్మనీ అమెరికాపై దండెత్తగలదా

### బ్రిటను ఎందుకై యుద్ధముచేయుచున్నది?

#### అమెరికాముఖ్యులఅభిప్రాయములు

అమెరికాలో ఇపుడు ప్రధానముగా జరుగుచున్న సంగతి బ్రిటనుకు కావలసిన యుద్ధసామగ్రి సహాయమిచ్చి దానికిబదులుగా బ్రిటనువారి నుండి నౌకాశ్రయాలు సైనికాశ్రయాలు, విమానాశ్రయాలు తీసికొనుటకు రూజ్వెల్టుకు అధికారమిచ్చే చిత్తుశాసనము ప్రజాప్రతినిధిసభలో ప్రవేశపెట్టబడినతర్వాత, ఆసభవారు దానినిగురించి విచారించుటకొక ఉపసంఘమును తమసభ్యులతోనే ఏర్పాటుచేసియుండిరి, ఆ ఉపసంఘము వారిపుడు వివిధ నాయకుల అభిప్రాయములను విచారణచేయుచున్నారు. ఈవిచారణవల్ల బ్రిటను, జర్మనీల పరిస్థితులును, వాటియుద్ధంయెడ అమెరికావారల వైఖరియు తెలియగలదు.

అమెరికా సంయుక్తరాజ్యము యుద్ధములో పాల్గొనుట మంచిదేనాఅనే సమస్యపై బ్రిటిష్ నాయకుల అభిప్రాయం రెండువిధాలుగా వున్నట్లు, మొన్నమొన్నటివరకూ లండనులో అమెరికా రాయబారిగా పనిచేసిన జోసెఫ్ కెన్నడీగారు జనవరి ౨౧వ తేదిన సాక్ష్యమిచ్చుచు చెప్పినాడు.

అమెరికా సంయుక్తరాజ్యము యుద్ధంలోకి దిగినట్లయితే, యుద్ధాన్ని కొనసాగించేమార్గాన్ని అవలంబించునని బ్రిటిష్ ప్రభుత్వంలో కొందరు సభ్యులు అభిప్రాయపడుచున్నట్లు కెన్నెడిగారు కొన్నిప్రశ్నలకు సమాధానంఇస్తూ తెలియజేసినాడు. అమెరికా యుద్ధంలోనికి దిగినట్లయితే బ్రిటిష్‌యుద్ధకృషికి పెద్ద అంతరాయంకలుగుతుందని మరికొంతమంది బ్రిటిష్ ప్రభుత్వసభ్యులు అభిప్రాయపడుచున్నారు. ఈరెండో అభిప్రాయానికి కారణాన్నికూడా వీరుసూచిస్తున్నారు. అమెరికానుంచి ఆయుధపరికరాల సరఫరా తగ్గిపోవడమే బ్రిటిష్‌యుద్ధకృషికి అంతరాయం ఏర్పడడానికి కారణమవుతుంది.

అమెరికా సంయుక్తరాజ్యాలు యుద్ధములో చేరడం మంచిదా, చేరకపోవడం మంచిదా అనే సమస్యపైన బ్రిటిషునాయకులలో ఏకాభిప్రాయంలేదనీ, బ్రిటిష్‌ప్రభుత్వాధికారులలో చాలామంది తమదేశానికి అమెరికానుంచి రావలసినంత సహాయం ఇంకా రావడంలేదని అభిప్రాయపడుతున్నారనీ జోసెఫ్ కెన్నడీ చెప్పినాడు.

"జర్మనీకు తగినంత విమానబలంవున్నట్లయితే ప్రమాదపరిస్థితి ఏదోవైనా సంభవించవచ్చు. ఆ బలమే వారికి వున్నదనడానికి సూచనలేవీ ఇప్పటివరకూ కనబడడంలేదు.' అని ఒకప్రశ్నకు సమాధానమిచ్చినాడు

"శాంతిపేరుతో ఒక ప్రకటించలేని యుద్ధాన్ని, ప్రజాస్వామ్యంపేరుతో నియంతృత్వాన్ని శాసనసమ్మతంగా చెయ్యడానికి ఉద్దేశించబడినదని సోషలిస్టునాయకుడయిన నార్మన్‌థామస్‌లుగారు జనవరి ౨౨వతేదిన సాక్ష్యమిస్తూ చెప్పిరి.

ఇటీవల అధ్యక్షునిఎన్నికలలో రిపబ్లికన్‌పార్టీ అభ్యర్థిగా ఉపాధ్యక్షపదవికి పోటీచేసిన సెనేటరు మెకనరీగారు ఈబిల్లు ప్రస్తుతరూపంలో "ఒక వ్యక్తికి అసాధారణమైన సర్వాధికారమిస్తున్నదికనుక తాను ఈబిల్లును ప్రతిఘటిస్తున్నానని ప్రకటనచేసినాడు కాని యుద్ధంలో ప్రవేశించడంతప్ప బ్రిటనుకు ఇతరవిధమైన సహాయమంతయు చేయుటకు తానుసమ్మతిస్తున్నానని నొక్కిచెప్పినాడు.

అమెరికా జనవరి ౨౩ వతేదిన కర్నల్ లిండ్‌బెర్గు సాక్ష్యంలో అన్నాడు. అయితే అట్లాంటికు మీదుగా బాంబర్లతో చేసేదాడివల్ల "చాలానష్టం కలిగించవచ్చునన్నాడు.

ఆధునికపరిస్థితులకు అవసరమైన తగుపాటి సైన్య, నౌకా, విమానబలాలనూ, రక్షణకు కావలసిన నౌకాశ్రయాలనూ సిద్ధంచేసుకున్నయెడల అమెరికాకు దండయాత్రాప్రమాదం ఉంటుందని తానుభావించడంలేదని కర్నల్ లిండుబెర్గు అన్నాడు.

న్యూఫౌండులాండు, వెస్టుఇంటీసు, హవాయి అలాస్కా ప్రాంతాలలో నేకాక కెనడా, దక్షిణ, మధ్య అమెరికాలు, గలాపాగోసుదీవులలో కూడా నౌకా, విమానాశ్రయాలు నిర్మించాలని లిండుబెర్గు సిఫారసుచేసినాడు. గ్రీసులాండులో రెండవ తరగతి ఆశ్రయాలు నిర్మించవచ్చునన్నాడు. వీలయినంత తొందరగా అమెరికా ౧౦ వేల ఆధునికయుద్ధవిమానాలను నిర్మించుటమంచిదన్నాడు. అయితే విమానబలము ఎంతఉండవలెననుసమస్య వెలుపలి దేశాలలో పరిస్థితిమీద ఆధారపడుతుందన్నాడు,

ప్రస్తుతయూరోపియన్ యుద్ధఫలితంఎలావున్నప్పటికి ౧౦ వేల ఫైటర్ విమానాలతో అమెరికా తనక్షేమాన్ని కాపాడుకోగలదనికర్నలు లిండుబెర్గుఅన్నాడు. ఆకాశమార్గంనుండి జరిపేదండయాత్రమాత్రమే ఫలించేఅవకాశాలుంటే జర్మనీ ఎన్నోనెలలక్రిందటనే బ్రిటన్‌పైన పనిచేసిఉండేదని ఇతడన్నాడు.

యూరపులోని ప్రస్తుతయుద్ధరాజ్యాలలో ఏదో ఒకటిగెలవడంకంటె పరస్పరం రాయబారాలు జరిపిసంధిచేసుకోవడమే తనకిష్టమని లిండుబెర్గుఅన్నాడు. ఎవరో ఒకరు గెలచేదాకా యుద్ధంసాగితే యూరపువిధ్వంసనమవుతుందన్నాడు హిట్లరుకువ్యతిరేకంగా బ్రిటన్‌పట్ల నీకుసానుభూతిఉన్నదా-అన్నప్రశ్నకు జవాబుగా లిండుబెర్గు ప్రజలపట్లనే నాకుసానుభూతిఉంది. వారియుద్ధకాలపట్ల కాదు' అన్నాడు,

అమెరికా బ్రిటనులు కలిసినప్పటికి ప్రస్తుతప్రాతిపదికమీద విజయంసాధ్యంకాదని ఇతడన్నాడు. సేనలవెనుక పతనంజరిగితేతప్ప అమెరికాయుద్ధంలోనికి దిగకుండా విజయంసాధ్యంకాదనిఅన్నాడు, బ్రిటిషువారికిసహాయంచెయ్యాలని అమెరికాప్రజలు అనుకూలతచూపడంపొరపాటని తానునమ్ముతున్నట్లు లిండుబెర్గు తెలియజేసినాడు,

సైనిక,నౌకా,విమానశాఖల ప్రధానాధ్యక్షులగు జనరల్‌మార్షల్, అడ్మిరల్‌సార్క్, మేజర్ జనరల్ బ్రెటీగారలు బహిరంగంగా సాక్ష్యమివ్వడానికి నిరాకరించినారు. రహస్యసమావేశంలోనే సాక్ష్యంఇస్తామన్నారు,

ఈప్రకటన కమిటీఛేర్మన్ అగు "హామిల్టన్‌ఫిష్ (రిపబ్లికన్) కు కోపంకలిగించింది. బహిరంగసభలో వీరుమాట్లాడవలెనని పట్టుబట్టుతానని పత్రికాప్రతినిధులకు ఇతడు తెలియజేసినాడు. అధికసంఖ్యాకపక్షమగు డెమోక్రాటిక్‌పక్షమువారు రహస్యసమావేశం ఏర్పాటుచేయదలచుకున్నారని దేశంమీదదండయాత్ర చెయ్యడం అసంభవమని కర్నల్‌లిండ్‌బెర్గ చెప్పినమీదట ఈముగ్గురూ ఏమిచెప్పబోతారో అనిపత్తిభయపడుతున్నదనిఇతడన్నాడు.

కాని బహిరంగంగా సాక్ష్యమివ్వవలెనను తీర్మానంవీగిపోయినది. రహస్యంగా సాక్ష్యమివ్వడానికి వీరిని ఆహ్వానించవలెనని నిర్ణయంజరిగినది.

## చిన్న యూరపు రాజ్యాలకు రూజువెల్టుగారి ప్రత్యేక ప్రతినిధి

అమెరికాలో న్యూజీలెండు రాయబారి నియామకము

అమెరికా ప్రధాననగరమగు వాషింగ్టనులో న్యూజీలెండురాయబారి నియామకముగూర్చి త్వరలోనే ప్రకటన చేయగలమని న్యూజీలెండుప్రధాని జనవరి ౨౨ వతేదిన వాగ్దానంచేసినాడు. న్యూజీలెండురాయబారి ఆస్ట్రేలియామంత్రితో సరిసమానస్థానంలోవుండునని ప్రధానిఅన్నాడు.

నౌకాశాఖలలో ప్రతిసంవత్సరం సుమారు ఉవందలరేటింగులకు శిక్షణయిచ్చుటకు ఒకప్రత్యేకఏర్పాటు చేయబడుననికూడ న్యూజీలెండు ప్రభుత్వముప్రకటనచేసినది

కెనడాకు ఇంకొక అమెరికా డిస్ట్రాయరు

ఇదివరకు అమెరికాకుచెందిన ఇంకొకడిస్ట్రాయరును కెనడాయుద్ధ నౌకాశాఖవారు తీసుకున్నారనిన్నీ, ఇందువల్ల కెనడాడిస్ట్రాయరులసంఖ్య ౧౩ అగుచున్నదనీ అధికారులచే తెల్పబడినది.

యూరపులో రూజువెల్టుఅధ్యక్షుని రాయబారిగావున్న కర్నల్ విల్యండొనోవాన్‌గారు బల్గేరియాప్రధానమంత్రితోను, విదేశాంగమంత్రితోను జనవరి ౨౨ వతేది సంభాషణలు జరిపిరి.

బల్గేరియారాజు బోరిస్‌గారు ౨౨ వతేదిన వారికి దర్శనమిచ్చిరి. డొనోవాన్ "రూజువెల్టు అధ్యక్షుని ప్రత్యేకమిలటరీరాయబారి" అనిజర్మనున్యూసుఏజన్సీవారన్నారు.

రూజువెల్టు అధ్యక్షుని ప్రత్యేకప్రతినిధి కర్నలు డొనోవానుగారు జనవరి ౨౨ వతేదిరాత్రి యుగోస్లావియాకుచేరెను. యుగోస్లావియా ప్రధాని ౨౩ వతేదినాడు డొనోవాన్‌ను సన్మానించెను.

తనరాక సమ్మర్‌వెల్సురాకలాంటిది కాదని డొనోవాన్ తెలియజేసెను.

౨౩ వతేదిమధ్యాహ్నం యుగోస్లావియారాజప్రతినిధి పాల్‌రాకుమారుడు కర్నల్ డొనోవాన్‌ను సత్కరించెను.

ఉపప్రధాని డాక్టర్‌మాసెకనూ, విదేశాంగమంత్రి మార్కోవిచునూకూడా డొనోవాన్‌తర్వాత కలుసుకొనెను.

ఇదిఇట్లుండ ప్రధానరాజకీయపత్రాలుగల ఒకపంచిని కర్నల్‌డొనోవాన్‌వద్దనుంచిఎవరోదొంగిలించినట్లు ఒకవార్తవచ్చినది.

కర్నల్‌డొనోవాన్ బల్గేరియానుంచి బుధవారంనాడు యుగోస్లావియాకు ప్రయాణమైనాడు. బల్గేరియా యుగోస్లావియాల సరిహద్దులో రైలులోనే ఆసంచినిఎవరోకొట్టివేసిరట.

కర్నలుడొనోవాన్ రూజువెల్టుఅధ్యక్షునివద్దనుంచి ఒకసందేశాన్ని యుగోస్లావియా రాజప్రతినిధి పాల్‌రాకుమారునికి తీసుకుపోతున్నట్లు కనుపించుచున్నది.

హంగరీకికూడ కర్నలుడొనోవను వెళ్ళునని హంగేరీయన్‌ప్రభుత్వపత్రిక ప్రకటించినది. హంగేరీనుంచి ఇతడుటర్కీకిపోతాడట

ఇంగ్లాండుకు అమెరికాప్రతినిధులరాక

బ్రిటిషువారినుండి నౌకాశ్రయాలను కవులుకు తీసుకొనుటనుగురించిచర్చించుటకైఅమెరికా ప్రతినిధివర్గము ఇంగ్లాండునుపోయియున్నది.

అమెరికా అధ్యక్షుని ఎన్నికలలోపోటీచేసి ఓడిన రిపబ్లికన్ పార్టీఅభ్యర్థి వెండెల్‌విల్కీగారు ఇప్పుడు యుద్ధసమస్యలోఅందరును రూజ్వెల్టుకు తోడ్పడవలసినదని అమెరికాప్రజలకు విన్నవించిజనవరి ౨౨ తేది యాంకీక్లిప్పర్ విమానంలో లండనుకు బయలుదేరిపోయినారు.

విల్కీగారు ఇంగ్లాండుకు బయలుదేరి పోతున్నప్పుడు చర్చిల్‌గారినుండి స్వాగతసందేశమున్నూ, వారులండనులోవున్నప్పుడు తననుకలుసుకోవలసినదని ఆహ్వానమున్నూ చేరినవి. విల్కీగారు తానులండనుచేరుకోగానే చర్చిల్‌కుతనరాక తెలియపరుస్తానని జవాబిచ్చినారు.

లండనులో తాను ఏసంభాషణకూడా వినదలచుకోలేదని, ఏలాంటిఉపన్యాసాలుకూడా ఇవ్వదలచుకోలేదనీ, పత్రికావిలేఖరితో అన్నాడు.

జనవరి ౨౪వతేదిన విల్కీగారు పశ్చిమ ఇంగ్లాండుకుచెందిన ఒకరేవులోదిగెను. బ్రిటిషుప్రధానితరఫునను, బ్రిటిషుప్రభుత్వము విదేశాంగకార్యాలయంతరఫునను అమెరికన్‌రాయబార కార్యాలయంతరఫునను వెళ్లినప్రతినిధులు విల్కీగారిని సన్మానించిరి. నేనుఇక్కడికి వెండల్‌విల్కీగామాత్రమేవచ్చాను. నేనుఎవరితరఫునను ప్రాతినిధ్యమువహించిరాలేదు. అనివెండల్‌విల్కీగారువిలేఖకులతోచెప్పిరి.

తానుకేవలం కుశలప్రశ్నలు వేయడమేగాక కొన్నివిశేషాలు బ్రిటిషువారికి తెలియజేయదలచినానని. ఐతే, దేశంనాల్గువైపులాచూపినతర్వాత గాని దాన్ని బయటపెట్టననీ అనినారు

గ్రేటుబ్రిటను యుద్ధశక్తిని తెలుసుకోడానికి, అమెరికాసంయుక్తరాజ్యాల సహాయంతో బ్రిటిషువారి యుద్ధపరికరాల ఉత్పత్తినిఏవిధంగా అభివృద్ధిచేయడానికివీలున్నది తెలుసుకోడానికి తానుతనకైతానే వచ్చినట్లు విల్కీగారు తెలియజేసిరి.

"ప్రజాస్వాతంత్ర్యమునకై జరుగుచున్న ఈ యుద్ధంలో అమెరికా గ్రేటుబ్రిటనుకు ఇవ్వగలిగిన సహాయమంతా ఇచ్చునట్లుచేయడానికి నాశక్తికొద్దిప్రయత్నిస్తాను" అని విల్కీగారనిరి.

"దేశం నాల్గువైపులచూచి, రూజువెల్టుగారు ఇచ్చినఒకలేఖను బ్రిటిషుప్రధాని చర్చిల్‌కు అందజేయడానికి వచ్చినాను" అనిమందహాసంతో విల్కీగారు లండనుచేరగానే రూటర్ విలేఖరికి తెలియజేసిరి.

బ్రిటనులో తానుప్రభుత్వ ఉద్యోగులతోనేగాక, సాధారణ ప్రజలతోకూడ సంప్రదించి విషయాన్ని తెలుసుకోబోతున్నానని విల్కీ అన్నాడు.

విల్కీ యూరపులోకూడ పర్యటనంచేయబోతున్నాడు. కాని తానుచూడబోయే రాజ్యాలలో జర్మనీచేరలేదని తెలియజేసినాడు.

పోర్చుగీసు ప్రధానమంత్రితో తానుఆర్థికవిషయాలనుగురించి ప్రసంగించినట్లు వారుచెప్పిరి.

## ఆంధ్ర ఆయుర్వేద పరిషత్—బెజవాడ

వైద్యవిద్వాన్ పరీక్షలు

పై వైద్యవిద్వాన్ పరీక్షలు ౧౯౪౧ సం॥ మార్చి ౧౬వ తేది మొదలు ౨౦ తేదివరకు ఆంధ్రదేశములయందలి ౧౨ కేంద్రములయందును, ఆంధ్రఆయుర్వేద కళాశాల (హైదరాబాదు-దక్కను) యందును జరుగును. పరీక్షార్థులు హైదరాబాదునందు కేంద్రముకలదని గుర్తించి, పరీక్షలకు సంబంధించినవివరములకు పరీక్షా కార్యదర్శిగారికి బెజవాడకు వ్రాసుకొనవలెను.

ఇట్లు
పండిత వేదాలకసుమల వెంకట రామానుజస్వామి.

వివరములకు:—
వైద్యవిద్వాన్, కంభం మెట్టు, విష్ణువర్ధనరావు, ఏ-ఆర్-ఏ-సి.,
బెజవాడ.

# పార్టీ రాజకీయాలలో విద్యార్థులు పాల్గొనరాదు

## గాంధిమహాత్ముని అనుభవపూర్ణమైన హితోపదేశము

బొంబాయి, జనవరి ౨౭.

అఖిలభారతవిద్యార్థి ఫెడరేషను ప్రధాన కార్యదర్శి ఎం.ఎల్.షా గారు నాగపూరుసమావేశంలో తమ ఫెడరేషను చీలికలనుగురించి గాంధీమహాత్మునికి వ్రాయగా, మహాత్ముడు ఈక్రిందిసమాధానము వ్రాసినాడు:

"నేను దేశముయొక్క పోరాటమును నిర్వహించుచున్నాను. దేశము అనగా, తక్కిన అన్ని సంఘములవలెనే విద్యార్థులుకూడ చేరుతారు.

"ముఖ్యముగా నాకు విద్యార్థులమీద ప్రత్యేక అధికారమున్నది నేను ఇంకను ఒకవిద్యార్థినేయని యనుకొనుచుందును. కనుక, నామీద విద్యార్థులకును అధికారమున్నది. అంతేగాక, నేను ఇండియాకుతిరిగివచ్చినప్పటినుండియు నాకు విద్యార్థులతో చాల సన్నిహితసంబంధము ఏర్పడినది. విద్యార్థులలో చాలమంది సత్యాగ్రహములో తోడ్పడి సేవచేసిరి. అందుచేత తాత్కాలికతరములు కాజాలని కారణాలు చూచుకొని విద్యార్థిప్రపంచం నన్ను త్రోసివేసినను అభయముతో నేను సలహాయిచ్చుట మానుకొనను.

"విద్యార్థులకు పార్టీరాజకీయాలు తగవు అన్ని విషయాలకు సంబంధించినపుస్తకాలను చదివినట్లే అన్నిరాజకీయపక్షాల వాదనలను తెలుసుకొనవచ్చును. వీటిఅన్నింటిలోని యథార్థాన్నిగ్రహించి, మిగతదానిని త్రోసివేయవలెను. విద్యార్థులు అనుసరించగల సముచితామైఖరి అది ఒక్కటే. విద్యార్థి ప్రపంచానికి పార్టీరాజకీయాలు తెలియరాదు. పార్టీరాజకీయాలతో సంబంధంపెట్టుకొంగానే వారు విద్యార్థులుగావుండరు. అందుచేత విషమస్థితిలో దేశసేవచెయ్యలేనివారగుదురు. ప్రధానకార్యదర్శిగావున్న మీరు పార్టీరాజకీయాలలో పాల్గొన్నట్లయితే, విద్యార్థులఆశయానికి తోడ్పడ్డవారుకారు.

"ఎల్లు కాంగ్రెసువారందరు దేవతలవలె మహాత్ములే కమ్యూనిస్టులందరుచెడ్డవారనలేము. అందుకని నాకుకమ్యూనిస్టులపై దురభిప్రాయమేదియు లేదు. కానినాకు తెలిసిన కమ్యూనిస్టుసిద్ధాంతములను నేనుఅంగీకరించలేను. డాక్టర్ అష్రఫ్ గారి శక్తిసామర్థ్యాలను నేను చాలా మెచ్చుకొందును. దేశంపై వారికిగలభక్తిని నేనుఎన్నడూ శంకించలేదు కాని విద్యార్థులకు వారుపెడత్రోవచూపుచున్నందుకు ముందుముందువారు విచారపడగలరని నేను అనుకొనుచున్నాను. నా అభిప్రాయాలయందు నాకుదృఢవిశ్వాసంవున్నట్లే వారిఅభిప్రాయమునందు వారికిని విశ్వాసము వుండవచ్చును. అందుచేతనేను వారితో వాదప్రతివాదనలకు దిగలేదు. నాతోవారును అజ్ఞానముగ నాతో వాదనకుదిగకుండ తప్పించుకొనుచున్నారు. కాని, విద్యార్థులు నేను దేశముకొరకుపోరాడుచున్నారని మాత్రం జ్ఞాపకముంచుకొనవలెను. నేను అనుభవములేనినాయకుడనుకాను. ౫౦ సంవత్సరములు విశ్రాంతిలేకుండపనిచేసిన సైనికుడను. అందుచేత నాసలహాను త్రోణీకరించుటకుముందు ౫౦ పర్యాయములు ఆలోచించుడు. నాసలహా యేమనగా నాకు తెలపకుండ సమ్మెలకు దిగకూడదు.

— —

## ఫ్రెంచి ప్రభుత్వ స్థితి గతులు

ఇపుడు ఫ్రెంచిప్రభుత్వస్థానమగు విషీలో పరిస్థితి జర్మనులుఆశించినట్లుగా పరిణమిస్తున్నట్లు కనబడదు. మార్షల్ పెషెయిన్ అధికారరీత్యా లావల్‌తో సామరస్యం కుదుర్చుకొన్నప్పటికి, లావల్ ఇంకా మంత్రివర్గములోనికి తీసుకొనబడలేదు. ఇందువల్ల జర్మన్ అధికారంక్రిందవున్న పత్రికలు కోపోద్రేకం ప్రకటిస్తున్నవి. జర్మను అక్రమణలోనుండు ప్యారిస్‌పత్రికలు ఇంకొ ముందుకుపోయి లావల్‌పై ఇదివరకు ఒక కుట్రజరిగిందని, సకాలంలో అది బయలుపెట్టబడినందున అందుకుకారకులైన వారిమీదచర్యతీసుకోవాలని వ్రాస్తున్నవి.

విషీప్రభుత్వంలో లావల్‌కుతిరిగి అధికారస్థానం ఇవ్వవలసినదిగా జర్మనీచేస్తున్న బ్రహ్మాండమైనఒత్తిడికి విషీలో ఎట్టిచలనంకూడాకనబడలేదు. అయితే ఫ్రెంచివర్గాలలో లావల్‌కు బాగాపలుకుబడి నశించడంవల్ల అతనినిబలవంతంగా విషీప్రభుత్వంలో చేర్చినయెడల అదిఒక అవమానంగా పరిగణించబడి లావల్‌కుగాని జర్మనులకుగాని ప్రజానురాగముకుండదనిభయము.

ఇపుడు ౨౦౦మందిసభ్యులతో "నేషనల్ కౌన్సిల్" అనేఒకసంస్థనుఏర్పాటుచేయదలచినారు. కేవలంసలహా యిచ్చుటమాత్రమే ఈ సంస్థయొక్కపని. ఈసభ్యులు ఫ్రెంచిజీవితంలోని ప్రధానవర్గాలన్నింటికీ ప్రతినిధులై యుందురు. రాజ్యాధికారి అధ్యక్షతక్రింద దాని సమావేశాలన్ని రహస్యంగా జరుగును.

మార్షల్ పెషెయిన్ మంత్రివర్గంలో పత్రికలు, రేడియో, ఫిల్ముపరిశ్రమలపై అధికారి యగు టిగ్జియన్ విజ్ఞాన్‌కూర్ రాజీనామా ఇచ్చాడు. మార్షల్ పెషెయిన్ మంత్రివర్గంలోనికి ఇతని పేరును సూచించినవాడు లావల్ అని, ఇతని రాజీనామావల్ల మార్షల్‌గారు నమ్మదగ్గవారినే తనమంత్రివర్గంలో ఉంచుకొనదలచినట్లు స్పష్టపడుచున్నదని ఒక లండన్ వార్త తెలుపుచున్నది.

ఇంతలో ఉత్తరఆఫ్రికాలో బ్రిటిషుసేనలమీద చర్యజరపడానికిగాను ట్యునీషియానుతన ఉపయోగానికి వదలవలెనని హిట్లర్ మార్షల్ పెషెయినును ఒత్తిడిచేసినట్లు ఒకవార్తవచ్చినది. ఇదివరకుకూడ చాలాసార్లు ఫ్రాన్సుకు జర్మనీ యేవేవో షరతులుచేసినట్లు వదంతులు బయలుదేరినవి. ఇటలీలో జర్మన్లు రెండుసాయుధ కవచదళాల డివిజన్లు సిద్ధంచేశారనీ, ఇవిమధ్యధరాసముద్రందాటి ట్యునీషియాలోని గొప్ప ఫ్రెంచి నౌకాశ్రయంఅగు బిజెర్టావద్ద దిగడానికి సిద్ధంగా వున్నాయనీ వదంతులు లేచినవి.

జర్మనీ ఇటలీలకూ ఫ్రాన్సుకూ జరిగిన యుద్ధవిరామ సంధిషరతులు పూర్తిగాప్రకటింపబడలేదు, అయినను ఫ్రెంచినౌకాదళము ఇంకను ఫ్రెంచివారిపైయున్న ఫ్రాన్సులోని నౌకాశ్రయాలు ఆసంధిషరతులప్రకారము జర్మనీ, ఇటలీలకుపోవనిభావించబడుతున్నది. ఇట్టిఅమూల్యమైన సౌకర్యాలను ఫ్రెంచిఅధికారులువదలుకోరు. కనీసంకొంత పోరాడికాని, లేదాఇందుకుప్రతిఫలంగా ఏదైనాపుచ్చుకొనికాని వదలుతారు. కానిహిట్లరు ప్రస్తుతం ప్రతిఫలంఏది ఇచ్చేస్థితిలోలేడు. ఫ్రాన్సుకు యుద్ధనౌకలూ, ఉత్తరఆఫ్రికాలో సైన్యదళాలూ ఉన్నంతకాలం జర్మనులు తమసేనలను దించడానికి సౌకర్యాలను ఫ్రాన్సునుండి బలవంతంగా పుచ్చుకోలేరు. ఆఫ్రికాలోని ఫ్రెంచిసేనలలో యుద్ధారంభపుసంఖ్య తగ్గించివేయబడిందని వారిలోఅనేకులు స్వదేశానికి పంపివేయబడిరని తెలుస్తున్నది. ఫ్రెంచివారినిఇటాలియనులు పూర్తిగానిరాయుధులను చేసినట్లుకనబడదు, అయితే లిబియాసరిహద్దునరక్షణలుమాత్రంతగ్గించబడినవి.

### ఫ్రెంచి-ఈక్వెటోరియల్ ఆఫ్రికా ప్రతిఘటన

"మనశత్రువులను నాశనంచెయ్యడానికి బ్రిటన్, బెల్జియంలు వాటిసామ్రాజ్యాలూ ఎటువంటి పట్టుదలచూపుతున్నవో ఈప్రాంతంలోఉన్న ఫ్రెంచిసామ్రాజ్యంకూడా అటువంటిపట్టుదలను చూపగలదు" అని ఫ్రెంచిఈక్వెటోరియల్ ఆఫ్రికాయొక్క గవర్నరు తనక్రిందిఅధికారులకుఒక ఆదేశంలో తెలిపినారు బ్రిటిషుప్రభుత్వముతోను జనరల్ డిగాల్‌తోను జరిగినరాయబారాలవల్ల నౌకావ్యాపారమూదిగుమతులూబాగుపడినవనిరి. ఫ్రాన్సును తిరిగిజయించి ఫ్రెంచిసామ్రాజ్యాన్ని రక్షించడంలో మేము జనరల్ డీగాల్‌తో ఏకీభవిస్తున్నామనిఅన్నాడు. లొంగిపోవడానికిబదులు యుద్ధాన్నే మేము స్వీకరించినాము అన్నాడు.

### హిట్లరు ముసోలినీల సంప్రతింపు

హిట్లరు ముసోలినీలు కొద్దిరోజులలో మళ్ళీ సమావేశంకాబోతున్నారని బర్లిను రోమ్‌లనుండి వచ్చుదగిన వార్తలద్వారా తెలుస్తున్నది. ఈసమావేశంలో ఫ్రాన్సుపరిస్థితిమీద చర్చజరుగుతుందని ఒకవార్త తెలుపుతున్నది.

— —

## హాలిఫాక్సు ప్రభువుగారు అమెరికా చేరుట

### సంప్రదాయవిరుద్ధంగా రూజ్వెల్టుగారు స్వయంగా సన్మానించబోవుట

బ్రిటన్ నిర్మించిన యుద్ధనౌకలన్నింటిలో క్రొత్తదీ, పెద్దదీఅగు ఒక యుద్ధనౌకలో అట్లాంటిక్ సముద్రాన్ని దాటిన హాలిఫాక్సు గారు జనవరి ౨౪వ తేదీ అమెరికాలో దిగినాడు. వారికి స్వాగత మిచ్చుటకై రూజువెల్టుగారు అన్నాపొలీస్‌కు వచ్చిరి.

అన్నాపొలీసులో దిగుతూనే హాలిఫాక్సుగారు పత్రికావిలేఖరులకు సంవిధంగా తెలియజేసిరి. "నేను బ్రిటిష్ యుద్ధమంత్రివర్గసభ్యుని గానుంటూనే అమెరికాలో బ్రిటిష్ రాయబారిగా పనిచేయుటానికి వస్తున్నాను. అమెరికా ప్రజలకు మా పరిస్థితిని ఎప్పటికప్పుడు తెలియజేస్తు మాకు అవసరమైన సహాయాన్ని వారు ఇచ్చేటట్లు చేయడమే నాకర్తవ్యం. వారుచేసే ఉదారసహాయం ఎంతత్వరగా వచ్చినట్లయితే అంతత్వరగా ఈ నాజీ ఆధిక్యాన్ని విచ్ఛిన్నం చేయగలుగుతాము. లేకపోతే నాజీ అధికారం ప్రజలను, ప్రపంచాన్ని దాస్యంలో ముంచివేస్తుంది. బహుశా మేము కటువైన దీర్ఘమార్గంలో పోవలసివుంటుందేమో, అయినప్పటికీ బ్రిటిష్ ప్రజలు అపూర్వసంఘీభావాన్ని ప్రదర్శిస్తున్నారు. అయితే మీ సహాయంతో చావునుండి తప్పుకొనగలుస్తాము. తద్వారా మీ నాగరికతా పునాదులను రక్షించగలుగుతాము."

హాలిఫాక్సుగారిని రూజువెల్టు అధ్యక్షుడు అమెరికా సముద్రజిల్లాలోనే సన్మానించెను. చీకటిపడిన కొంచం సేపటికే రూజువెల్టు హాలిఫాక్సుగారలు రూజువెల్టుగారినౌకలోనే కలుసుకొనిరి. ఛెసాపిక్ అఖాతంలో కొన్నిమైళ్లదూరాన ఈ సమావేశం జరిగినది. రూజువెల్టు వైట్‌హౌసును వదలివెళ్లి సన్మానించడం అమెరికా సాంప్రదాయాలలో ఇదివరకెన్నడూ జరిగినవిషయం కాదు. హాలిఫాక్సు "కింగ్ జార్జి యుద్ధనౌక" నుంచి "పోటోమకు" లోకిదిగెను. రూజువెల్టు దంపతులు హాలిఫాక్సుదంపతులను రేవుకుచేర్చిన తరువాత అందరూ కలసి మోటారులో వాషింగ్టనుకు వెళ్ళారు.

రూజువెల్టు తనచిన్నపడవలో వెళ్లినప్పుడు నౌకాశాఖకార్యదర్శి, కర్నల్‌నాక్స్, నౌకాదళప్రధాని అడ్మిరల్ స్టార్కు వెంటవుండిరి. బ్రిటిష్ రాయబారకార్యాలయోద్యోగి నెవిల్లీబటర్, ఆస్ట్రేలియామంత్రి కౌసీ, ఇంకా కెనడా, దక్షిణాఫ్రికా ప్రతినిధులూ ఒకచిన్ననౌకను ఎక్కివచ్చిరి.

## బ్రిటను, అమెరికా రష్యాల పరస్పరసంబంధాలు

ఇంగ్లాండు రష్యాసంబంధాలసమస్య బ్రిటిషుపార్లమెంటు కామన్సుసభలో జనవరి ౨౧ వ తేదీనవచ్చినప్పుడు, విదేశాంగశాఖసహాయమంత్రి ఆర్ ఏ. బట్లరు గారు బ్రిటిష్ ప్రభుత్వం గతసంవత్సరం జూన్ ౧౫, అక్టోబరు ౨౧ వ తేదుల లో ఇంగ్లాండు, రష్యాల ఒడంబడికకు గాను కొన్ని ప్రతిపాదనలను రష్యాకు అందజేసినదని. పరస్పరంగా విశాలరాజకీయ సుహృద్భావ స్థాపనకు కూడా మరికొన్ని సలహాలను గతసంవత్సరం అక్టోబరు ౨౨ వ తేదీన సూచించెననిసమాధానం చెప్పిరి ఈవివిధ ప్రతిపాదనలనుగురించి రష్యాప్రభుత్వం విచారించ లేదని బట్లరుగారు తెలియజేసిరి.

లెనిన్ ౧౭ వ మృతవార్షిక సందర్భములో మాస్కో కమ్యూనిస్టు పార్టీ సెక్రెటరీ జనవరి ౨౧ వ తేదీరాత్రి ఉపన్యాసముచేస్తూ, ఈయుద్ధమునుండి రష్యా బయట నేవుండడానికి నిశ్చయించుకొనివున్నదని ప్రకటనచేసెను.

రష్యాతన సంపద్బలముతోను, సైనికబలంతోను, తనక్షేమాన్ని కాపాడుకోవడంతప్ప, ఇతరదేశాలేవీ ఇందులో లేవనిఅనెను.

ఇప్పుడు అంతర్జాతీయపరిస్థితులనుపటికంటె ఇంకాఎక్కువక్లిష్టంగా నేవుందనీ, హటాత్తుగాపరిణామాలు జరుగుతూవున్నాయనీ, దీనినిబట్టి అసాధారణమైన మెలకువతో వుండడంఅవసరమనీఅనెను.

ఇదివరకు రష్యాకు విమానములను విమానపరికరములను యెగుమతిచేయరాదని ఒక నైతికనిషేధం అమెరికా సంయుక్తరాజ్యంలోవుండేది. ఆదితొలగింపబడినట్లు ఇప్పుడు ప్రకటింపబడినది.

౧౯౩౯ డిసంబరులో రష్యాఫిన్లాండులకు యుద్ధం జరుగుచుండినప్పుడు రష్యాచేసిన చర్య అప్పట్లు అనంగీకారసూచకంగా ఈనిషేధం వేయుబడినది. ఇప్పుడు అనిషేధమెంతమాత్రమూ అవలంబించబడదని అమెరికా స్టేటు డిపార్టుమెంటువారు అమెరికాలోని రష్యారాయబారికి తెలియచేసిరి.

### ఇటలీ, గ్రీసుల యుద్ధము

జనవరి ౨౨వ తేది ఏథెన్సు రేవుపిరేయస్‌పై ఆకాశంనుండి బ్రిటిషువిమానాలకు ఇటాలీయువిమానాలకు హోరాహోరియుద్ధంజరిగినది. ఒక ఇటాలీయువిమానము కూలిపోయినది. ఒక బ్రిటిషువిమానముకూడాపడిపోయినది. ౨౧వతేదినాటి రెండు దాడులలోపనివాళ్ళయిండ్లు సుమారు ౫౦వరకు నాశనమైనవి కొందరుప్రజలకు ప్రాణనష్టంకూడాకలిగినది.

గ్రీసుసేనలు అల్బేనియాలో ఒకఇటాలియన్ సైన్యదళాన్ని నాశనంచేసినతరువాత మధ్యరంగంలో రక్షిస్థానాలనుండి ఇటాలియనులను తరుముగొట్టినవి,

జనవరి ౨౧వ తేదీన అల్బేనియామధ్యరంగంలో యుద్ధం చాలాతీవ్రంగాజరిగినది.

బ్రిటిషువిమానాలు వెలోనాపై ఇదివరకుజరిగినదాడులన్నిటికంటే చాలాతీవ్రమైనదాడి జనవరి ౧౯వతేదిరాత్రి జరిపినవి.

టెపెలిని ప్రాంతంలో ఇటాలీయులు తీవ్రప్రతిఘటనచేసి విరమించవలసివచ్చినది.

అల్బేనియాసరిహద్దులోవున్న రాయిటర్ ప్రత్యేకవిలేఖరి బ్రిటిషు,గ్రీకు యుద్ధవిమానాలు ఇటాలీయులతో ౨౦వ తేది అల్బేనియాయుద్ధరంగంలోని ఉత్తరభాగంలో కొన్ని పోరాటాలు జరిపినవి. ఈప్రాంతంలో ఇప్పటికికొన్నిరోజులనుంచి యుద్ధచర్యలు అతిచురుకుగా జరుగుతున్నవి.

సాలోనికాలోని సైనికస్థావరాలపైన ఇటాలీయులు బాంబులువేసినందున పెద్దపెట్టుమంటలు చెలరేగినవి.

గ్రీకుయుద్ధరంగంలో శత్రుసైనికసరఫరాస్థానాలపైన కొన్నిచర్యలుజరిగినవి. సైనికనివాసాలపై బాంబులదాడి జరిగింది.

సిరనైకాప్రాంతంలో ఇటాలీయువిమానాలు శత్రునకౌలపైనను, యంత్రదళాలపైనను దాడులు జరిపినవి.

సంవత్సరమునకు
౬ హాలీ రూపాయలు
ఆరుమాసాలకు
౩ రూపాయలు
బ్రిటిషిండియాలో
సం॥చందా
౫-౪-౦ [illegible].
పాతపత్రికలకు
వెల ప్రత్యేకము.

# గోలకొండ పత్రిక

# Golkonda Patrika

The only Popular Paper That reaches The masses In the Dominions
Best Medium for Advertisement

PUBLISHED ON EVERY MONDAY AND THURSDAY

*Volume* **15** **Hyderabad-Dn.** **Monday 3 February 1941** *Number* **75**

# గాంధి మహాత్ముడు అరెస్టగు చో, ముందు ఏర్పాట్లు

## కాంగ్రెసు సత్యాగ్రహోద్యమ విశేషాలు

అఖిలభారత కాంగ్రెసుపరిషత్తు కార్యదర్శి రాష్ట్రీయకాంగ్రెసుసంఘాలకు పంపిన విజ్ఞప్తిలో "గాంధీగారు అరెస్టుఅయినచో, వారికి బదులు నాయకులుగా ఎవరునుఏర్పాటు గారు. అట్టి సందర్భములో కాంగ్రెసు వాదులు తమతమ అంతరాత్మ ప్రేరణప్రకారము ప్రవర్తించవలె" నని తెలిపిరి.

"కాంగ్రెసుసంఘసభ్యులు సత్యాగ్రహము చేసి అరెస్టుఅయినచో వారికి బదులుగా ఆస్థానములలో ఎవరినిగని నియమించక, ఆ సంఘమునురద్దుచేసి వేరుగా సత్యాగ్రహ సంఘములు ఏర్పడిపనిచేయవలెను. గాంధీగారి ఆదేశాలను అన్నిటిని నిర్వర్తించుచో తాముసత్యాగ్రహ మొనర్చుటకు అర్హులమా? గామాఅని ఎవరికివారు నిర్ణయించుకొనగరు" అని ఆ విజ్ఞప్తిలో వివరింపబడెను.

**౭౫ సంవత్సరముల వృద్ధునిఅరెస్టు**

పాలకొల్లువాస్తవ్యులును ౭౫ సంవత్సరముల వయస్సుగలవారునుఅయిన కొల్లా వెంకటరామయ్యగారు జనవరి ౨౭వతేదిన పాలకొల్లు గ్రామమందు సత్యాగ్రహమొనర్చిరి. వారికికోర్టుతేచువరకు శిక్షయు ౫౦ రూపాయలు జుర్మానానువిధించిరి. జుర్మానాచెల్లించనిచో మరిరెండురోజులు కోర్టుతేచువరకు శిక్షయని తీర్పుచెప్పిరి.

**అరెస్టులేని సత్యాగ్రహము**

జనవరి ౨౫వతేది గాంధీమహాత్ముని ఆదేశానుసారము ఉదయము ౧౧ గంటలకు గుండెమడకల వాస్తవ్యులగు గండు వెంకట్రామనాయుడుగారు ఉదయగిరియందు సత్యాగ్రహమొనర్చిరి. వీరుసత్యాగ్రహము చేయుటకుముందు కలెక్టరు గారికి తెలియపరచిరి. సత్యాగ్రహముచేయుప్రదేశమునకు పోలీసుసబిన్స్పెక్టరుసిబ్బందితో వెళ్లిరి. కానివారిని అరెస్టుమాత్రముచేయలేదు.

జనవరి ౨౦వతేదినాడు పల్నాడులో స్థానిక హరిజనహాస్టలు కార్యదర్శియగు కావూరి [illegible]య్యగారు సత్యాగ్రహంచేసినందున పోలీసువారువారిని అరెస్టుచేసి నరసారావుపేటకు తీసుకొనివెళ్లిరి. పల్నాటిలో ఇదేమొదటిసత్యాగ్రహము.

అప్పరాచెరువులో జనవరి ౨౪వతేదినాడు హరిజన చెన్నప్పగారు సత్యాగ్రహమొనర్చినందువలన వారికి అనంతపురము డివిజను డిప్యూటీ కలెక్టరుగారు (౪) నాలుగు నెలల ఖైదుశిక్ష విధించిరి.

తాడిపత్రిలో జనవరి ౨౫వతేది సాయంత్రం ౫ గంటలకు పబ్లికుబజారుయందు కాప్పె నాగప్పగారు సత్యాగ్రహమొనర్చినను పోలీసువారు అరెస్టుచేయక సబిన్స్పెక్టరుగారు వారిని ఇంటికి వెళ్లిపోవలసినదిగాచెప్పిరి. కానికాప్పె నాగప్పగారు తిరిగి సత్యాగ్రహమొనర్చిన ప్రదేశమునకే వెళ్లిరి.

కంభం (కర్నూలులో) లో ౧౫ మంగళవారమునాడు సత్యాగ్రహముచేసినందుకు అరెస్టుకావింపబడినవి. యం.యస్. శాస్త్రిగారు క్షమాపణఇచ్చినందుకుగాను ప్రభుత్వమువారు వారినివిడుదలచేసిరి వీరిపై జిల్లాకాంగ్రెసువారు చర్యగైకొందురని తెలియవచ్చుచున్నది.

జనవరి౨౭వతేదినాడు శ్రీకాకుళములో జిల్లాకాంగ్రెసు అధ్యక్షులగు గేదెలచంద్రయ్యనాయుడుగారు సత్యాగ్రహ మొనర్చిరి. వీరికి కలెక్టరుగారు. ౩నెలలకఠినఖైదు ౫౦రూపాయల జుర్మానానువిధించిరి. జుర్మానాను చెల్లించనిచో మరి౧౫దినములు శిక్షను అనుభవింపవలసినదిగా తీర్పుచెప్పిరి.

జనవరి౨౭వతేది కల్యాణదుర్గం తాలూకా శెట్టూరు గ్రామ పంచాయతి ఉపాధ్యక్షురాలును ఏబదిఏండ్లు వయస్సునిండిన వృద్ధురాలు అగు ఉమాబాయమ్మగారు శెట్టూరుగ్రామములో సత్యాగ్రహమొనర్చిరి. వీరికి అనంతపురము సబుడివిజనలు మేజిస్ట్రీటుగారు ౩మాసముల విడిఖైదు విధించెను.

జనవరి౨౫వతేది నంద్యాల జిల్లాలో ప్రథమ స్త్రీ సత్యాగ్రహిణియగు శ్రీమతి నోస్సెడ్డిలీలావతీదేవి గారికి సత్యాగ్రహనేరమునకై నాలుగుమాసము లవిడిఖైదును ౪౦౦రూపాయల జుర్మానాయును విధించబడెను. జుర్మానా చెల్లించనిపక్షమున రెండుమాసముల అదనపుశిక్ష ననుభవింపవలసినదిగా స్థానికజాయింటు మేజిస్ట్రీటు గారు తీర్పుచెప్పిరి.

బళ్లారిజిల్లా మొలగవల్లిగ్రామమున ఎం. వీరభద్రయ్యగారు (న్యూ-లుటీచరు) జనవరి ౨౫వ తేది సత్యాగ్రహమొనర్చిరి. వీరినిఅరెస్టుచేయనందున మహాత్ముని ఆజ్ఞానుసారము ఢిల్లీకిప్రయాణోన్ముఖులైనారు. త్రోవలో కర్నూలుజిల్లాలోని దగురాతన గ్రామములో యుద్ధవ్యతిరేకప్రచార మొనర్చినను అరెస్టుకాబడలేదు.

కర్నూలు జిల్లాబోర్డుఉద్యోగమునకు రాజీనామానిచ్చి జె. శివయ్యగారు కర్నూలుకు సమీపమునున్న పెదపాడులో జనవరి ౨౫వతేదినాడు సత్యాగ్రహ మొనర్చిరి. వీరికి కర్నూలు డివిజనల్ మేజిస్ట్రీటుగారు ౬ నెలల కఠినశిక్షను ౩౦౦ జరిమానానువిధించిరి. జుర్మానాచెల్లించనిచో మరి మూడునెలలశిక్ష విధించిరి.

సత్యాగ్రహంచేసినందుకుగాను అహరారు పార్టీవర్కరు పూర్వపుఅఖిలభారతకాంగ్రెసు పరిషత్తుసభ్యుడగు సూఫీమహమ్మదుషాఫీ గారికి లాహోరునగర మేజిస్ట్రీటు జనవరి ౨౫వతేదినాడు రెండు సంవత్సరములకఠిన శిక్షవిధించెను.

---

మొదటిపేజీ తరువాయి

సమకూర్చవలసిన సమస్య పూర్తిగా చర్చించబడినది.

సభముగిసినతరువాత బెవిన్ గారు ఇట్లుప్రకటనచేసినారు:—"నేను సాధ్యమైనంతవరకు ఐచ్ఛికపద్ధతినే వుపయోగిస్తాను. ఇప్పుడు ఖాళీపడుతున్నస్థానాలు పూర్తికావడానికి తక్షణమే కావలసినంతమందిచేరవలెనని నేనుకోరుతున్నాను. ఇంకో సంరిజిస్ట్రేషను కొంతకాలంపట్టుతుంది. ఉభయసంఘాలూ ఈసమస్యను విచారించాలని నేనుకోరినాను" జనవరి౨౮వతేదిరాత్రి అనుకూలమైన వాతావరణపరిస్థితిలో కొన్నిబ్రిటిషువిమానాలు ఉత్తర,మధ్య జర్మనీప్రాంతాలమీదకు పోయి చాలాచోట్ల మంటలబాంబులనూ, పేలుడుబాంబులనూవేసినవి.

నార్వేదేశపుఅగు నార్విక్ మీదదాడిచేసి ఓడలునిలిచేచోట్లకు నష్టంకలిగించినవి.

'అమెరికాయిచ్చేవో సహాయంతో బ్రిటను జర్మనీనిఓడించగలదు'అని అమెరికాసైన్యశాఖాధ్యక్షుడు జనరల్ జార్జ్ మార్షల్ గారు జనవరి౨౮వతేదిన పత్రికాప్రతినిధులతో చెప్పెను. వారు హిట్లర్ అన్నిటికీ తెగించి రానున్న వసంతకాలంలో గొప్పదండయాత్రజరుపునని సూచనలుకనబడుచున్నవనిరి.

సోవియట్ ప్రభుత్వం రష్యాలోతయారవుతున్న సమస్తను జర్మనీకిపంపి, అందువలన బహుశా అమెరికానుంచి దిగుమతిచేసుకుంటున్నదన దానికి ప్రబలనిదర్శనాలువున్నవని బ్రిటిషుఆర్థికరక్షణశాఖామంత్రి హ్యూడాల్టనుగారు జనవరి ౨౯వ తేదిన ప్రకటించెను.

---

## దేశోద్ధారక, ఆంధ్రకేసరి గ్రంథమాలల పుస్తకాలను జప్తుచేయుట

౨౯వతేది అస్ఫందారు ౧౩౫౦ఫ. నాటి సాయంత్రం ౭ గంటలరైలుబండిలోమహబూబునగరంనుండి శ్రీ. పి. హనుమంతరావు వకీలుగారు హైదరాబాదు కాచిగూడస్టేషన్లో దిగిరి. కరోడ్గిరీనాకావద్ద అమీన్ మొదలగువారు శ్రీవారిసామాను సోదాచేసిచూచి, దేశోద్ధారక గ్రంథమాల మరియు ఆంధ్రకేసరిగ్రంథమాల వారిచేప్రకటింపబడిన మరికొన్ని పుస్తకములు వారిదగ్గరనుండగా తీసుకొనిజప్తుచేసుకున్నారు. ఈపుస్తకాలు ప్రభుత్వం వారిచేత నిషేధింపబడలేదనియు, కేవలం ముల్కీ ప్రచురణయులనియూ శ్రీరావుగారు యెంతవచ్చచెప్పినను ప్రభుత్వోద్యోగులు వినిపించుకొనలేదు. విచారించగా అట్టిపుస్తకాలను తీసుకొన్నట్లు రశీదుమాత్రం అనుగ్రహించిరి. జప్తుచేయబడిన పుస్తకములు:—

దేశోద్ధారకగ్రంథమాలవారి ప్రచురణములు: ౧ ప్రజలు-ప్రభుత్వము, ౨ కాంగ్రెసుసంస్థానములు. ౩ సంస్థానాలసమస్యలు ఆంధ్రకేసరిగ్రంథమాలప్రచురణములు, ౪. ౫ రెండవప్రపంచయుద్ధమూ (రెండుభాగములు], ౬ కిమ్మతేమ్మరలు, ౭ ఫెడరేషన్. పైపుస్తకములుయింతవరకును తిరిగియివ్వబడలేదు.

---

రష్యాద్వారా అమెరికాసామగ్రి జర్మనీకిపోతున్నదనిచెప్పడానికి నిదర్శనంలేదనీ ఐతే, ఇంతకుపూర్వం కొద్దిగావుండే అమెరికాప్రత్తిఎగుమతి(జర్మనీకి) ఈమధ్యఎక్కువైనమాటమాత్రంనిజమనీ, గడచినమూడునెలలలో ౩౦వేలటన్నులవరకు పెరిగినదనియు డాల్టన్ గారనిరి, రష్యాకూడా జర్మనీకి ఇప్పుడువిశేషంగా ప్రత్తిని ఎగుమతిచేస్తున్నమాటనిజం. ఇదేవిధంగా ఇత్తడి,రాగి ఎగుమతులుకూడా అమెరికానుంచి రష్యాకుఎక్కువైనవి. ఇంతకుపూర్వం ఈలోహాలఎగుమతి బహుస్వల్పంగామాత్రమేవుండేది. ఇప్పుడుఈలోహాలు ౫౭వేలటన్నులు ఎగుమతి అవుతున్నవి బహుస్వల్పంగా అమెరికానుంచి రష్యాకు ఎగుమతిఅయ్యేగోధుమలు (౧౯౪౦)లో ఒకలక్షటన్నులైనది. రష్యావారుఇటీవలఒడంబడికప్రకారం జర్మనీకిప్రధానంగా ఎగుమతిచేయదలచిన సరుకు గోధుమలు. పెట్రోలియము. ౧౯౪౦ సంవత్సరపు మొదటిరెండు నెలలలో సోవియట్ అమెరికా నుంచి సోవియట్‌రష్యాకు నూనెతీసేయంత్రాలు[illegible].

౧౯౪౦ సంవత్సరపు మొదటి ౯ నెలల్లో సోవియట్ అమెరికానుంచి సోవియటు రష్యాకు నూనెతీసేయంత్రాలు ౧౯౩౯లోకంటె దాదాపు రెట్టింపుఎగుమతిఐనవి. ఈఎగుమతులవిషయమై బ్రిటిషువారి అభిప్రాయాలు స్పష్టంగా తెలియజేయవమైనది ప్రస్తుతం అమెరికా ప్రభుత్వంతో జరుగుతున్న సంప్రదింపుల ఫలితంగా రష్యాఅమెరికాలమధ్య ఈఎగుమతి వ్యాపారాన్ని తగ్గించడానికి వీలైతేకావచ్చునని డాల్టన్ తనఅభిప్రాయాన్ని తెల్పెను. జర్మనీ ప్రస్తుతం మరికొంత విదేశమారకాన్ని ఏర్పాటుచేసుకొనుటకు చూస్తున్నదనియు బ్రిటిషుప్రభుత్వం ఈ విదేశసరుకు ఎగుమతులు జర్మనీకి పోకుండాచూచుటకు సర్వకృషి చేయుచున్నదనియు చెప్పిరి.

రష్యాకు అమెరికా ఎగుమతుల విషయమై మొన్న డాల్టను గారుచేసినప్రకటనపైన వ్యాఖ్యానంచేస్తూ, అమెరికా రష్యాకు చేసేఎగుమతులు విశేషసైనికవిలువకలిగినవి కావని అమెరికాలో కార్డెల్‌హల్ విశదపరచెను.

జనవరి ౨౫వతేదిన సమ్మనర్ వెల్సుతో సుమారు గంటసేపు సంప్రదించినతరువాత హాలిఫాక్సు ప్రభువు, రష్యాకు అమెరికా ఎగుమతుల విషయమై స్టేటుడిపార్టుమెంటుకు ఫిర్యాదుచేయవలచునన్నాననియు ఇవిజర్మనీకి వెళ్లుచున్నట్లు బ్రిటనుకుఅనుమానంగాఉన్నదనియు పత్రికాప్రతినిధులకు తెలియజేసెను. "అమెరికానుండి చాలసరుకు రష్యాకువెళ్లినది, ముమ్ముందు ఇంకాఎక్కువవెళ్లబోతున్నది. లాటిన్ అమెరికా దేశాలనుండికూడా వెళ్ళుతున్నట్లు నమ్మవలసిఉన్నది" అని హాలిఫాక్సు ప్రభువుఅన్నాడు.

**ఐర్లాండుకు ముట్టడిబాధ**

సరఫరాసమస్యపై డీవెలరా, జనవరి ౨౯వ తేది రాత్రి బ్రాడుకాస్టుచేస్తూ, ఐర్లాండుప్రభుత్వము తేయాకుకు నాలుక్ పరిమాణనిర్ణయపద్ధతి ఆవలంబించడానికి, పెట్రోలుఖర్చుఇంకాతగ్గించడానికి నిశ్చయించినట్లు ప్రకటనచేసెను- వ్యవసాయదారులు ఆహారపదార్థాలను ఇంకాఎక్కువగా పండించవలెననియు, పిండికిబదులుగా ఆలుగడ్డను ఉపయోగించవలెననియు పశువుల ఆహారమునకై సాధ్యమైనన్ని దుంపపైరులుపండించవలెననియుచెప్పెను- పెట్రోలుకుబదులుగాఇతరవస్తువులను ముఖ్యంగావాయువును, ఉపయోగించవలెనసెను-

డివెలరా ఇట్లుఅనెను- "యుద్ధమారంభమైననాటినుండి ఐరిషుజాతి ప్రమాదంలోవున్నది-శాంతిఏర్పడేవరకు ప్రమాదంలోనేవుంటుంది- ఐరిషుజాతియావత్తు శత్రుదాడినిఎదుర్కొనడానికితనరక్షణసైన్యబలాన్ని చాలాచురుకుగా అభివృద్ధిచేసుకొన్నది ఎనిమిదితొమ్మిది నెలలక్రిందట హెచ్చరికచేయబడినప్పటికంటె ఇప్పుడుసైన్యం ఎంతోఎక్కువబలంగావున్నది-

ఇప్పుడువచ్చినఇంకొకప్రమాదం ఆర్థికసంబంధమైనది. యుద్ధరాజ్యాలు ఒకరిపైఒకరు ముట్టడిచేసుకొనడంలో మనపైముట్టడిచేస్తున్నారు బయటినుంచి మనకువస్తున్నవస్తువుల సరఫరావిషయంలోమనం ఎంతప్రమాదానికైనను సిద్ధపడవలెంలో ఒక్కక్షణమైనావ్యర్థంగా పోగొట్టుకోజాలము ఈ యుద్ధం ఇంకా ఎక్కువకాలంసాగితే పూర్తిముట్టడివల్ల మనసంఘంచాలా బాధపడవలసివస్తుంది కాని ఈఒత్తిడికి మనజాతిఎన్నడు లొంగిపోవలసిన అవసరంలేదు-ఇందులోవుండే ప్రమాదాలన్నిటినీ ఎదుర్కొనడానికి, క్రొత్తపరిస్థితినిబట్టి మనఆర్థికజీవితంలో అవసరమైన సర్దుబాటుచేసుకొనుటకు మనందృఢనిశ్చయం చేసుకొనవలెను"

**అమెరికావ్యవహారాలు**

అమెరికానౌకాశాఖ విమానరక్షణలను ఆధునికపద్ధతులతో బలపరచుటకు ౩౦ కోట్లడాలర్లవ్యయానికి సెనేటువారు ఆమోదించిరి-

జనవరి ౨౭వతేదిరాత్రి అమెరికాప్రభుత్వభవనములో "లీజుఅండ్ లెండుబిల్లుపై సవరణప్రతిపాదనలమీద చర్చజరుపుటకు ఒకఅసాధారణ సభజరిగెను- ఈసభకురూజ్వెల్టు విదేశాంగమంత్రి కార్డెల్‌హల్ గారిని,కోశాంగమంత్రిమార్గంథోగారిని, రిపబ్లికను , డెమోక్రాటికుపార్టీ నాయకులనుఆహ్వానించెను-

అమెరికాసంయుక్తరాష్ట్రాలఅధ్యక్షుని అధికారాలను తగ్గించేమూడుప్రధానసవరణలను ప్రతిపాదించడానికై ఆలోచనలుజరుగుతున్నట్లు తెలుస్తున్నది-ఈసవరణలు ఈవిధము గానున్నట్లు తెలుస్తున్నది- ౧-ఈబిల్లుకుఅవధుతేది ౧౯౪౩ జూను ౩౦ గానుండవలెను- (౨) సైనిక పరికరాలను వేటినిపంపవలసివచ్చినా రూజువెల్టుఅధ్యక్షుడుముందుగా సైనిక నౌకాప్రధానోద్యోగులతో సంప్రదించవలెను- (3) ఈశాసనప్రకారముజరిపే చర్యలపైన అప్పుడప్పుడు నివేదికలు తెలుపుచుండవలెను-

ట్రినిడాడ్ గవర్నరు సర్ హ్యూబర్టుయంగ్, లీవార్డుదీవులగవర్నరు సర్ గోర్డన్ లీథెమ్ వీరిద్దరూ సర్ లీనార్సు ఓరీలీ (ట్రినిడాడి ప్రముఖుడు) గారిని వెంటపెట్టుకొని ఒకవిమానంలోలిస్బను ప్రయాణమైవెళ్ళిరి- బ్రిటిషువెస్టుఇండీసులోని విమానసౌకార్యాలయాలను అమెరికాకు కౌలుకుఇచ్చేవిషయమై లండనులోజరిగే సంప్రదింపులలో వీరుపాల్గొందురట- అమెరికాతరపున మొట్టమొదటి రాయబారోద్యోగిగా, అమెరికాలో ఇదివరకు జాతీయపారిశ్రామిక పునర్నిర్మాణసంస్థ అధ్యక్షుడగు శామ్యూల్ కే విల్లియమ్సుగారిని నియమిస్తారని ఒకవిలేఖరి తెలుపుతున్నాడు

**బ్రిటిషు యుద్ధాశయం**

'యుద్ధానంతరం భూప్రదేశాల పంపకంవిషయమై బ్రిటిషుప్రభుత్వం రహస్యమైన ఒడంబడికలు ఏవీచేసుకోవడంలే'దని హాలిఫాక్సుప్రభువు జనవరి౨౫వతేదిన పత్రికాప్రతినిధుల సమావేశములో అనెను.

బ్రిటిష్‌యుద్ధాశయాలను గూర్చి హాలిఫాక్సు ప్రభువు, 'వీటివిషయమై ముమ్ముందు బహిరంగప్రకటనఒకటిచేయగలను. అయితే యుద్ధంలో గెలవడమే మామొదటి యుద్ధాశయం. తర్వాత మరి యుద్ధాలుజరుగుటకువీలులేకుండఉండేటట్లు ప్రపంచాన్ని పునర్నిర్మాణంచెయ్యడం ఇంకొకఆశయం"అనెను.

"ప్రజాస్వామ్యానికై పోరాడుచున్నాము. లేనిచో బ్రిటనులు ఇంతబాగా పోరాడుచుందురు' అని హాలిఫాక్సుప్రభువు అనెను.

'డెయిలీ టెలిగ్రాఫ్' పత్రికయొక్క న్యూయార్కు విలేఖరితో వెండెల్ విల్కీగారు అమెరికా నుండిబయలుదేరుటకుముందు మాట్లాడుచు ఇట్లు చెప్పినారు,

'యుద్ధంగెలిచినతర్వాత ఇంగ్లాండు ఏమికాబోతున్నదో తెలుసుకొనబోతున్నాము. ఇంగ్లాండుకుకావలసినవస్తువులను నాదేశం ఎలాతయారుచేస్తుందో కనిపెట్ట దలచుకున్నాను. రాబోయే సహాయంతోపోల్చితే ఇప్పటిసహాయంఒకలెక్కలోనిదికాదు. మేము ఇంకా ప్రారంభదశలో ఉన్నాము . కాని అమెరికా పారిశ్రామికప్రతిభలో నాకువిశ్వాసంఉంది. నేను మరలివచ్చినతర్వాత చురుకుగా వస్తూత్పత్తి జరుగడానికి చెయ్యగలిగిందంతా చేస్తాను. అమెరికానుండిమీకు శరపరంపరగాసరుకుచేరగలదు. బ్రిటన్ విజయం తప్పనిసరి అమెరికాసహాయంతోఎలాగూ గెలిచితీరుతుంది. ఈసహాయం హెచ్చుతున్నకొద్దీ నాజీలు ఓటమిని ఒప్పుకోవాలి'

యుద్ధానంతరం బ్రిటనులో బోల్షివిజంవస్తుందనేవదంతులలో నిజం కనుక్కొనడానికి బ్రిటనుకువెళ్లుతున్నారనే వార్తల మాటేమిటిఅని ప్రశ్నించగా విల్కీ ఇట్లనెను.

"నేను చాలాఉదారంగా ఆలోచిస్తాను. యుద్ధానంతరరంమార్పులు రాకతప్పదు,అంతమాత్రంచేత బెంగపెట్టుకోనక్కరలేదు. హిట్లరునుఓడించినతర్వాత మీలో సామ్రాజ్యతత్వం మరిఒకలిని పోగూడదనిమాత్రం నేనుఆశిస్తున్నాను"అనిఅనెను. లండనులో ౨౭వతేది విలేఖరులతో విల్కీ ఇట్లనెను.

బ్రిటనుకు అమెరికను డిస్ట్రాయర్లనుఇచ్చివేసి, అందుకుపరిహారంగా బ్రిటిషు నౌకాకేంద్రాలను విమానకేంద్రాలను, అమెరికాతీసుకొనేఏర్పాటు అమెరికాలో సర్వజనామోదకరంగా వున్నది,

తర్వాతవిల్కీ భోజనంచేసి రూజ్వెల్టునుండి తెచ్చినలేఖను చర్చిల్ గారికిఅందజేసెను. తర్వాత కార్మికమంత్రి బెవిన్‌తో సంభాషించెను. ప్రాతఃకాలము బ్రిటిషువిదేశాంగమంత్రి ఈడెనుతోసంభాషించెను. విల్కీఐర్లాండులోవున్న సమయంలో తాను డివెలరాను చూడదలచినట్లు తెలియపరచెను.

---

## అల్యూమినియం వస్తువులు

**ఇండియాకు తెప్పించగూడదు**

ఢిల్లీజనవరి౨౫

విదేశాలలో అల్యూమినియాతో తయారుచేయబడుతూవున్న అల్యూమినియాగుండీలు, రంగులు, టీచెమ్చులెనింగులు, యుద్ధాలలోవాడే పాతరసామానులు, స్ట్రాప్లు, మొదలైనవాటిని అనగా అల్యూమినమును యేరూపంలోనైనా విదేశాలనుంచి యిండియాకు ఎవరు తెప్పించగూడదని ఇండియా ప్రభుత్వంవారీవేళ ఇండియాగెజెటులోప్రకటించిరి-

Printed and Published by, G. Ramakrishna Reddy at the Golkonda Power Press. Hyderabad Dn. Editor S. Prathapa Reddy B. A B.L.